





# కథలు

నీతి, పురాణ, పొడుపు

# నవ్య కథావళి





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050015099

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

Approved by the Text Book Committee, Madras for Lower Forms Class Use Vide Fort. St. Gazette Page No. 24 1st June 1948.

# న వ్య క థా వ ళి

విద్వాన్ కవిరాజు పండిత

## పెనుమెచ్చ సత్యనారాయణరాజు

జయపుర సంస్థాన గౌరవాస్థానకవి

తణుకు బోర్డు హైస్కూలు సీనియర్ తెలుఁగుపండితుల




పబ్లిషర్సు:

శ్రీ నరేంద్రనాథ సాహిత్య మండలి,

తణుకు.

1948

 [వెల రు 0—12—0

44485

# విజ్ఞాపనము

మన సంఘమునందు కొన్ని పూర్వాచారములు ప్రస్తుత పరిస్థితులకు సరిపడక 'ప్రతియింటను' పరస్పర సంఘర్షణకు కారణములై సుఖజీవనమునకు ప్రతిబంధకములగుచున్నవి. వ్యక్తిగతముగా 'ప్రతివాఁడు' ను ఆయాఆచారములను మార్చుకొనుట న్యాయమని గ్రహించియును సంఘమును ఎదిర్చి ధైర్యముగా నిలువలేకున్నాఁడు. కావున నిట్టి సంస్కారమునకై మన మన్ని విధముల పాటుపడవలసియున్నది. ఈ కథలు పాఠకలోక మానసము లందట్టి పరివర్తనమును మెలమెల్లగాను మృదువుగాను గలుగఁజేయునని నమ్ముచు వారికీ 'నవ్యకథావళి' నందఁజేయుచున్నాము.

ప్రకాశకులు.

# న వ్య క థా వ ళి

## ౧ ప రీ క్ష

### 1

విజయనగరసంస్థాన మప్టైశ్వర్యములతోఁ దులఁదూఁగు చున్న దినములవి. ఆరోజులలో నాసంస్థానమునకు జగన్నాథ రాజు ప్రధానమంత్రి. ముసలితనమప్పుడే వానిపైఁ బడెను. బుద్ధిబలము తగ్గలేదు. కాని మనస్సు విశ్రాంతికై ప్రాకులాడు చున్నది.

ఒకనాఁడాతఁడు తన ప్రభుదర్శనము చేయనేఁగెను. రాజాతనిఁ గాంచి గౌరవించి కూర్చుండుమనెను. మంత్రి యాసీనుఁ డయ్యెను.

ప్రభువు వానిని గాంచి "మహామంత్రు లూరకరారు. విశేషములేమైనఁ గలవా?" యని ప్రశ్నించెను.

అదివిని మంత్రి "ప్రభూ! విశేషములేమీలేవు. కాని నామనస్సు విశ్రాంతిఁ గోరుచున్నది. రాచకార్యములయెడ విముఖత్వము చూపుచున్నది. కావునఁ బ్రభువుల యాజ్ఞ గైకొనవచ్చితిని. మంచియో చెడ్డయో యిన్నినాళ్ళు ప్రభు సన్నిధిని గడచి చనినవి. ఇకఁ జెడ్డమాట పైని వేసికొన కుండ సెలవుతీసికొన నెంచితిని. ఆదరముతో నా విశ్రాంతి కనుమతి దయచేయ వేఁడికొను చున్నాను" అనెను.

రాజు వినయశీలుఁడు, మహామేధావి, యనుభవజ్ఞుఁడునైన మంత్రిని వీడుట కిష్టములేక, కాదు కూడదని బలవంతపెట్టెను. కాని తుట్టతుదకు వానిమాటల కడ్డు చెప్పఁ జాలక యన్ని గుణములఁ దన్నుఁ (మంత్రిని) బోలిన మంత్రి నొక్కని తనయొద్దఁ బ్రవేశపెట్టి విశ్రాంతి గైకొను మనెను.

మంత్రి 'చిత్త'మని పని వినెను.

ఆ మఱునాఁటి పత్రికలలో నీ క్రింది ప్రకటనము వెలువడెను:

విజయనగర సంస్థానమునకు మంత్రియొకఁడు కావలెను. అతఁడు కేవలము పట్టభద్రుఁడై కానక్కఱలేదు. లోకానుభవము, చతురత, విషయజ్ఞత, ప్రయాసశీలత, ప్రజాహిత కార్య నిర్వహణ దక్షత మున్నగు ప్రధాన గుణము లభ్యర్థి కలిగి యుండవలయును. మఱియు నభ్యర్థి హృష్టుఁడై పుష్టుఁడై యజీర్ణాదిరోగరహితుఁడై యుండవలయును. అభ్యర్థుల గుణగణాదులు పరిశీలింపఁబడును.

ఇట్లు,

విజయనగరము,
18—12—1862.

జగన్నాథరాజు, దివాన్.
విజయనగర సంస్థానము.

2

ఆ ప్రకటన వెలువడినతోడనే విజయనగర నగర వీథులన్నియు వింతవింత మానిసుల రాకలచేఁ గ్రొత్తదనము వహించినవి. రైళ్ళకు జట్కాలకుఁ గారులకుఁ గూలినాలి

వారికిఁ గావలసినంత పని గలిగినది. ఏ వీథిలోఁ జూచినను నిలువుటంగీలవారు, కుఱుచకోటులవారు, ఫ్రెంచి కట్టింగుల వారు, పొడుగు లాగులవారు, పగిడీలవారు, పొట్టిలాగులవారు, హేటులవారు, బూటులవారు కన్పట్టుచున్నారు. అర్థశాస్త్రములు శుక్రనీతి సారములు చంకలఁ బెట్టుకొని మౌల్వీలు పండితులు గూడఁ బ్రత్యక్షమైరి.

ఈ రీతిగాఁ దమతమ యదృష్టముల నెమకికొనుచు వచ్చిన వారి కందఱకు జగన్నాథరాజు మంచి విడిది పట్టు లేర్పాటు చేయించెను. విడిది పట్టులన్నియు మంచినీటి నాళములు, విద్యుద్దీపములు, మఱసురఁటులు, విసుగుడుచేవ మంచములు, గాలిబాలీసులు గలిగి చలువరాతి కూర్పులచేఁ గనులపండువొనర్చుచుండెను.

హుక్కా పీల్చు నలవాటును పక్కాభోగి విడిచి పుచ్చెను. పది గంటల ప్రొద్దెక్క లేచు సుకవాసి యుషఃకాంత నారాధింపఁ దొడఁగెను. నాస్తికుఁడు భగవత్ప్రార్థనమునమునిఁగిపోయెను. మౌల్వీలు కురాను నాశ్రయించిరి. పండితులు భగవద్గీతఁ బఠించుచుండిరి. ప్రతివ్యక్తియందు వినయము మూర్తీభవించి తాండవమాడుచున్నది. ఆశారేఖలు ఆశాంతముల కెగఁబ్రాఁకు చున్నవి. కాని మానవ మానసికతత్త్వవేత్త యగు వృద్ధమంత్రి చాటుననుండి యీ బాతులలో రాజహంస మెచ్చట నున్నదా? యని యూరయుచుండెను.

## 3

ఒకనాఁడు వారందఱకుఁ గందుక క్రీడ సలుపవలయు నని బుద్ధి పుట్టినది. తమకోరిక మంత్రి వర్యునకుఁ దెలియఁ జేసిరి. సరే కొదువయేమి? వెంటనె కందుక క్రీడారంగము సంసిద్ధమయ్యెను. ఎల్లరు నాటలలోఁ బాల్గొనిరి. బంతి పైకిఁ క్రిందికి అటు--ఇటు కార్యాలయములోఁ బని నేర్చుకొను వాని వలెఁ గొట్టఁబడు చున్నది.

ఈ బంతియాట యందలి పౌరులకుఁ జాలఁ గ్రొత్తగా జిత్రముగా నుండెను. వారొరంతప్రొద్దు చదరంగము మున్నగు నాటల నాడువారేకాని పిల్లలాడుకొను నీబంతియాట నాడి యెఱుఁగరు.

ఆయాట మహోత్సాహముగా సాగిపోవుచుండెను. తరంగమువలె ముందునకుఁ జొచ్చుకొనిపోవు బంతిని గొంద ఱినుప తలుపులవలె నడ్డుపడి యాఁపఁదొరఁకొనిరి. సంధ్యాకాలము వఱకు నాట సాగినది. అందఱకు నొడళ్ళనిండఁ జెమ్మటలు చిమ్మినవి. మోములు కందినవి. ఊర్పులుక్కిరి బిక్కిరైనవి. కాని నాఁటి సాయం సంధ్యవేళకు జయాపజయముల నిర్ణయము కాలేదు.

ఆట యింకను బూర్తి కాలేదు. కనుచీఁకటి పడుచున్నది. ఆటకాండ్రు అలసట తీర్చుకొనుచున్నారు. ఆమైదానము చెంతనే యొక కాలువకలదు. దానికి వంతెనలేదు. వడ్లబస్తాలతో బండ్లు కాలువ దిగిరావలయును. ప్రొద్దుగ్రుంకు నా సమయములో

నొక బక్కరైతు ధాన్యపుబండి నొకదాని నా కాలువ దాటించుచుండెను. ఎడ్లు బండి. లాగలేక లాగుచున్నవి. చక్రములు రొంపిలో దిగబడి జాఱిపోవుచున్నవి. పైకి లేచుట లేదు. ఆ బక్కరైతు బిక్కమొగముతో నీయాటకాండ్రవైపు చూచెను. వీరు తమ చేతులలోని కందుక కాష్ఠముల నిటునటు త్రిప్పుకొనుచు గులాసకబురులు చెప్పుకొనుచుండిరి. కాని యొక్కరును అయ్యో పాపము అన్నవారు లేరు. ఆ సంజ చీకటిలో సాటిరైతొక్కడును వానికిగానరాలేదు. కాన ఆశాపూరితనేత్రములతో నతడు మననాగరికులవంకజూచెను.

కాని సానుభూతి వాత్సల్యము ఉదారత వారిచూపులలో శూన్యమయ్యెను. మదము స్వార్థము మాత్రము గోచరించెను.

## 4

ఆగుంపులో దయా సాహసములుగల యువకుడొక డుండెను. వానిచూపు పీదీనుని పైబడెను. క్షణకాలముక్రిందటనే వానికాలికి బంతియాటలో దెబ్బతగిలియుండెను. నడువలేక నడచుచు - వచ్చి యాతడు 'నీబండికి సాయపడుదునా' యని ప్రశ్నించెను. బండివాడు 'సామీ మీరు గొప్పవారు మీబోటి వారికీపని యేలా చెప్పగలను? ఏదో నేనేత్రిప్పలు పడెదను లెండు, లేదా యింతలో మావారెవ్వరైన వత్తురులెండు' అనెను

"కాదు, అలాగున ననకుము, నీవు బండియెక్కుము. నేను చక్రము భుజమునాని పైకి లేవనెత్తుదును; బండి సులువుగా

గట్టెక్కునులే” అని యువకుడు పలికెను. అన బండివాఁడు తొట్టి లోనికెక్కెను. ఎడ్లనదల్చెను. యువకుఁడు చక్రమునెత్తి త్రోయు చుండెను. కాని యా పెనురొంపిలో బండి కదలలేదు. మోఁకాలి బంటిరొంపిలో యువకుఁడు దిగఁబడిపోయెను. కాని ధైర్యము వీడలేదు. ఉత్సాహముతో పూనికతో మరల మరల బండినిద్రోయఁగా నెట్టకేలకు బండి గట్టెక్కెను.

రైతు యువకునకుఁ జేతులుజోడించి “అయ్యా ! నన్ను మీరు రక్షించినారు. లేనిచో నే నీ రేయి యెల్ల నిందేయుండ వలసి వచ్చెడిది. కూడు నీళ్ళులేక మాఁడిపోవలసి వచ్చెడిది'' అన యువకుఁడు చిఱునవ్వు నవ్వి “అయితే కర్షకా! నాకేదైన బహుమాన మిత్తువా యేమి?' యనెను.

రైతు గాంభీర్యముతో పరమేశ్వరానుగ్రహ మున్నచో నీవు మహామంత్రివి కాఁగలవులే అన్నాఁడు. యువకుఁడు అది విని సందేహములోఁబడెను. వాని మొగమువంకను దేవనిగాఁ జూడఁదొడఁగెను. 'వాఁడె జగన్నాథరాజేమో'అని యనుమాన పడెను. వాని మొగముతీరుకూడ నట్లెయుండెను.

రైతుకూడ యువకునిఁ దేటిపాటి చూచెను. యువకుని మదిలో సందియమును గ్రహించెను. 'శోధించినఁగాని లోతు నీళ్ళలోని రత్నము దొరకదని నుడివెను.

నెలనాళ్ళు లిట్లె కడచిపోయినవి. పరీక్షాదినము వచ్చి నది. ఎవరికి వారె తమతమ యదృష్టములఁ దడవికొనుచున్నారు.

'ప్రతివాని' ముఖమున ఆశా నిరాశలు ప్రోపులాడుచున్నవి. ఎవని భాగ్యము పండునో యెవఁడెఱుంగును!

అది యసలుసంజవేళ. రాజదర్బారు చిత్రవిచిత్రాలంకారములతో వెలుఁగొందుచుండెను. ఆపట్టణములోని పిన్నలు పెద్దలు సంపన్నులు ఉద్యోగులు అభ్యర్థులు మున్నగువారిచే దర్బారు కిటకిట లాడుచున్నది. అభ్యర్థులగుండెలు దడదడ లాడుచున్నవి. అంతలో జగన్నాథరాజు లేచి నిలువఁబడి మీసలు సవరించుకొని యభ్యర్థులఁగూర్చి యిట్లనియెను:

"మహాశయులారా! నేను మిమ్ములనందఱ రావించి చాల శ్రమపెట్టినాను క్షమింపుఁడు. ఈపదవికి దయాళు, ఆత్మబలశాలి, ఉదారహృదయుఁడు కావలెను. ఆపత్తిని వీరత్వముతో నెదిర్చి సంస్థానమునకు సంపత్తినిఁ గూర్చువాఁడే యీ పదవికర్హుఁడు. మనయదృష్టముచే నట్టివాఁడు మనకు లభించెను. ఇట్టి సుగుణములుగలవారు లోకములోఁ గొలఁదిమంది మాత్రమె యుందురు. వారందఱకు నందుబాటులోనుండరు. రామకృష్ణవంటి మంత్రి లభించుట మన సంస్థానము చేసిన పుణ్యము".

మంత్రి నోరివెంట నీమాటలు వెలువడఁగానే సభ్యులయు నభ్యర్థులయుఁ జూపులన్నియు నావన్నెకానిపైఁబడెను. సభ్యుల కన్నులలో సత్కారము చిందులాడెను. అభ్యర్థుల చూపులలో నసూయలు రేకెత్తెను. అదికాంచి మంత్రి,

"మహాజనులారా! క్షత్రగాత్రుడయ్యు నేయునకుండ కష్టదశలోనున్న పేదరైతును గాపాడ బండిని రొంపినుండి యుద్ధరించెనో వాఁడు సాహసికుఁడు, ఆత్మబలశాలి, ఉదారుఁడు అనుటకు సందియములేదు. అట్టివాఁడు పేదల నెన్నఁడు బాధింపఁడు. వాని సంకల్పము దృఢమైనది. చిత్తము స్థిరమైనది. ఒకప్పుడతఁడు పొరపడినఁ బొరపడవచ్చును. కాని దయాధర్మములు వానిని దప్పుదారిని బడనీయవు" అని రామకృష్ణను దగ్గఱకుఁబిలిచి శిరమునఁ జేయిడి యాశీర్వదించి తనగద్దెపైఁ గూర్చుండఁ బెట్టెను.

---

# ౨. కులీన

## 1

వెంగళరావు పెద్దలందఱు జమీందారులు. వాని దేవిడీ ముందొకప్పు డేనుఁగులు 'పహారా' యిచ్చుచుండెడివి. కాని యిప్పు డచ్చోటున నొక ముసలిబఱ్ఱె బడుగు దేహముతో నల్లాడుచున్నది. అది పాఁడిగేదె యైనఁ గావచ్చును. కాని దాని నెప్పుడు పాలు పితుకువాఁడు బడితబాజా చేయుచునే యుండును.

ఆయూరిలోనితటాకములు దేవాలయములు మాత్రము వాని పూర్వుల కీర్తికిఁ జిహ్నములై నిలిచియున్నవి. కాని వానికి వేనికిఁ బూజాపురస్కారములు జరుగుచున్న జాడలు కానవచ్చుటలేదు.

పాపము! ఆయన రాబడి యంతయు న్యాయవాదుల క్రింద వ్యయమైపోయెను. ఇప్పుడొక వేయి రూపాయలు మాత్రము సంవత్సరమునకుఁ బొలములవల్ల లభించుచున్నవి.

వాని కిద్దఱు పుత్త్రులు. పెద్దవాఁడు పాపారావు. రెండవ వాఁడు రంగారావు. జ్యేష్ఠుఁడు పట్టభద్రుఁడైనాఁడు. పరీక్షల పరిశ్రమముతో వాని యారోగ్యము పూర్తిగాఁ జెడిపోయెను. ఆరోగ్యము సరిగా లేకున్నను నతఁడొక కార్యాలయములో నుద్యోగిగాఁ జేరెను.

రంగారావు విశాలోరస్కుఁడు. మలచితిర్చిన బాహుదండములు గలవాఁడు. నిండైన మొగముగలవాఁడు. ఉదయముననే రెండుసేర్ల గేదెపాలు గడగడ నొక్క గ్రుక్కలోఁ ద్రాగుచుండును.

పాపారావు బలమంతయు బి.ఏ., యను రెండక్షరములు పీల్చివేసినవి. వాని కన్నులలో వెలుఁగు లేదు. ముఖములోఁ గాంతిలేదు. కావున నతఁడు వైద్యగ్రంథముల నాశ్రయించెను. ఆయుర్వేదమును అవలోడనము చేసెను.

ఎప్పుడు చూచినను వానిగదిలో కల్వములో నృత్యము చేయు పొత్తరముధ్వని కర్ణానందముగా వినఁబడుచుండును.

పాపారావు ఆంగ్లవిద్యాధికుఁడైనను ఆర్యసంప్రదాయములు గలవాఁడు. అందుచే నాయూరివా రాతని నెక్కువగా గౌరవించెడివారు.

అతఁడు ప్రతిసంవత్సరము ఉగాదికి స్వగ్రామమునకు వచ్చెడివాఁడు. నాఁడు తనయూరిలో జరుగు నాట పాటలలోఁ బాల్గొనుచుండెడివాఁడు.

సమిష్టికుటుంబగౌరవము నిలువబెట్టుట యాతనివ్రతము. నేఁటి కాలపు స్త్రీలకుఁగల వ్యష్టికుటుంబమోహము దేశారిష్టదాయకమని యతఁడు సదా యోచించుకొనుచుండెడివాఁడు. తఱచుగా నతఁడా యూరిలోని సమిష్టికుటుంబములలోఁ బొడచూపు కలహముల నణఁచుటకుఁ బ్రయత్నించుచుండువాఁడు. అందుచే లలనామణు లాతని ద్వేషించుచుండెడివారు.

అత్తమామలయెడను, ఆడుపడుచులయెడను,మఱఁదుల యెడను గౌరవభావము గలదియయ్యును వానిభార్య హాయిగా స్వేచ్ఛగా కులాసాగాఁ దన కాపురము తాను చక్కఁబెట్టు కొనుచు, సమిష్టికుటుంబ నిర్వహణభారమునుండి బైటఁబడఁ గోరుచుండెను. "ఎంతయోర్పు నేర్పు ఉన్నను ఎప్పుడో యొక ప్పుడు సమిష్టికుటుంబములోఁ గలహములు పొడచూపక మానవు. కావున నిప్పుడే వేఱుపడి సుఖముగా ప్రశాంతిగా జీవింపవలయు" నని యామె యుబలాటపడుచుండెను.

ఆమె తండ్రికూడ నొక పిల్లజమీందారు. వానికారుగురు కూఁతులు. ముగ్గురు తనయులకు మహేంద్రవైభవముతో పెండ్లిండ్లు చేసినాఁడు. దగ్గఱనున్న ధనమంతయు వ్యయపెట్టి నాఁడు. ఇఁక నాల్గవ పుత్త్రిక వివాహము సంక్షిప్తముగాఁ జేయఁ దలపెట్టినాఁడు. చూచుచుఁ బేదవానికీయలేఁడు. భాగ్యవంతుల్కైకె పరువెత్త లేదు. కాన నొకప్పుడుగాదివేఁకల చందాకై తనయొద్దకు వచ్చిన పాపారావుపై నాతని బుద్ధిపాఱినది. తన నాల్గవపుత్త్రిక వెంకయ్యమ్మారావు నాతనికిచ్చి పెండ్లిచేసెను.

వెంకయ్యమ్మారావు తలిదండ్రుల చేతులలో నల్లారు ముద్దుగాఁ బెరిగిన ముద్దరాలు, అత్తింటికి వచ్చినది. అంతా క్రొత్తగానున్నది. పెంపుడులేళ్లులేవు. చిలుకలు పావురాలు కానరావు. తానత్తింటికి వచ్చునపుడు తెచ్చికొనిన పట్టు చెప్పులు తొడిగికొని విహరించుటకు ఉద్యాన వనములు లేవు సామాన్యగృహము. అయినను నామె గుణవంతురాలు గానఁ గొలఁదినాళ్ళకే యత్తింటి పనులకలవాటు పడెను.

## 2

నాఁడు రెండుజాముల ప్రొద్దెక్కినది. ఎండ మెండుగాఁ గాయుచున్నది. వెంకయ్యమ్మారావు వంటజేసి మఱఁదిరాకకై యెదురుచూచుచున్నది.

అంతలో రంగారావు వచ్చి 'వదినె! యివిగో పిట్టలు ఈ రెండింటిని వండిపెట్టు' మనెను. ఆమె ఱెక్కలు ముక్కలు చేసికొని యాపిట్టలఁగోసి కూరవండెను. ఇంటిలోనున్న చిట్టెడు నేయి కూరలోఁబోసి తిరుగఁబోఁత పెట్టెను. పీఁటవేసి యాకు వేసి వంటకములు వడ్డించి మఱఁదిని భోజనముచేయ రమ్మనెను.

రంగారావు వచ్చి పీఁటపైఁ గూర్చుండి ముందుగా ప్రప్పు గలిపి,

'వదినె! నేయి!'

వెం:—బాబూ నేయి అయిపోయినది. ఉన్ననేయి 'కాస్త' పోఁపుకే చాలలేదు.

రం:— మొన్ననేకా వదినె నేయి తెచ్చినది. అప్పుడే అయి పోయినదా?

వెం:—బాబూ! నిన్నటికున్న నేయి చిట్టెఁడుమాత్రమె. ఆ కాస్త కూరలో వేసినాను.

రం:—ఓహో! వదినెగారూ మీపుట్టింట నేతినదులు ప్రవ హించుచున్నవి కాఁబోలు ...

స్త్రీ తిట్టులు సహింపఁగలదు. దెబ్బల నోర్వఁగలదు. కాని పుట్టినింటివారిని నిందించుట విని సహింపలేదు. కావున నామె వెంటనే మోమడ్డముగాఁద్రిప్పి,

'ఏనుఁగు చచ్చినను బ్రతికినను వేయిరూపాయలె. ఈ మాత్రమునేయి మాయింట బ్రతినిత్యము చాకళ్ళు, మంగళ్ళు త్రాగిపోవుచుందురు' అనెను.

ఆమాటలకు రంగారావు దండతాడిత భుజంగమువలె మండిపడి కంచమునెత్తి క్రిందవేసి కొట్టి 'జాగ్రత్త! నీపండ్లు పీకించెదను. నాలుక చీల్పించెదను. తిన్నఁగా మాట్లాడు' అనెను.

ఆ పలుకులు ములుకులై యామెహృదయమున గ్రుచ్చుకొనెను. మోమెఱ్ఱవాఱెను. మేను కంపించెను. పెదవులదరెను. చెమ్మటలు క్రమ్మెను. మఱఁదినిఁగాంచెను.

"ఇంతకు నీవు బ్రతికిపోయినావు ఆయన ఊరిలోలేరు. ఉన్నచో నీబ్రతుకేమయ్యెడిదో?" అని యనెను.

చదువురాని యా మొరటుమానిసి కామాటలు మఱింత కోపకారణమయ్యెను. చీటికి మాటికిఁ దన బోటినిఁ గొట్టుట వానికలవాటు. కావుననే పీఁటనెత్తి వదినెపై విసరినాఁడు.

"ఎవనిబలముచూచుకొని నీవు తందనాలాడుచున్నావో వానిపనికూడఁ బట్టెదను జాగ్రత్త" అని గద్దించినాఁడు.

ఆమె తన మృదుకరముతో నాపీఁట నడ్డుకొని తలకు దెబ్బతగులకుండఁ గాపాడుకొనెను. కాని వ్రేళ్ళుమాత్రము చిట్లినవి. అభిమానము కోపము హెచ్చుటచే నామె గాలి తాఁకున నిటునటు కొట్టుకొను రావి కసవలెఁ గంపించుచుఁ దనగదిలోనికిఁ జనెను.

స్త్రీకి మానము, ప్రాణము, బలము, ధనము, పరువు, ప్రతిష్ఠ, సాహసము, సర్వము భర్త. ఆ భర్తృధనమునుజూచి కొనియే యామె గర్వించుచుండును. ఆగర్వము గంగపాలగు నపుడామె యెట్లుభరింపఁగలదు?

3

పాపారావు ప్రతిశనివారము సాయంసంధ్యవేళకుఁ దన యింటికి వచ్చుచుండెడివాఁడు. ఈతగవు లక్ష్మివారమునాఁడు జరిగినది. ఈ రెండురోజులనుండి యామె నీళ్ళు నిప్పులులేక నిట్టుపానముచేయుచుఁ బతిరాక కెదురుచూచు చుండెను. శనివారము వచ్చినది. సాయం సమయమైనది. పడమటిదిక్కున నరుణరాగములలముకొనుచున్నవి. గొల్లపిల్లలాలమందలఁదోలు కొని యిండ్లకరుదెంచుచున్నారు. ఆసమయములో పాపారావు యథాప్రకారముగా నింటికివచ్చి వసారాలోనున్న కుర్చీలోఁ గూర్చుండెను.

వానిరాకఁ గాంచి యిరుగు పొరుగువారు నలుగురు నచ్చటికిఁ జేరిరి. రాత్రి తొమ్మిదిగంటలదాఁక వారు లోకాభిరామాయణములో మునిగియుండిరి. వెంకయ్యమ్మారావున కాకాలవిలంబనము చాల కష్టముగా నుండెను.

భోజనపువేళయైనది. అందఱులేచి వెడలిరి. పాపారావు ఇంటిలోనికి వెడలుసమయముచూచి రంగారావు దగ్గఱకువెళ్ళి యేకాంతముగా "అన్నయ్యా! మావదినెతోఁ గొంచెము నోరు జాఱనీయవద్దని చెప్పు. లేనిచో నేదో యొక యనర్థము జరుగును" అనెను.

వారితండ్రికూడ దానికి 'తందానతాన' యనెను. రంగా రావు అంతతోనాఁగక 'అన్నయ్యా! ఆమె యెత్తు వారిచేతిబిడ్డ యైన నగుఁగాక మేము తన చాకళ్ళు మంగళ్ళు పాటియైనఁ గామఁట. విన్నావా?' అన్నాఁడు.

పాపారావు:— (విచారముతో) ఏమిజరిగినదిరా ?

రగారావు:— ఏమీలేదు అన్నయ్యా! మావదిన్ని ఊరకే రుసరుస లాడును. దుమదుమ లాడును. రవరవ లాడును. తన పుట్టింటివారితో సరిపోమని నిరసించును. ఈస డించును.

పాపారావు తలపంకించి యుంకించి తిన్నఁగావెళ్ళి భోజనముచేసి భార్యయొద్దకేఁగెను. ఆమె మౌనముద్రవహించి కూర్చుండియుండెను. తమ్ముని మాటలచేఁ బాపారావు మనసు కలఁకఁబాఱి యుండెను. అదిచూచి యామె.

'ఏమండి! మీమనస్సు నిర్మలముగానున్నదా?' యనెను.

పాపారావు:— ఆఁ నిర్మలముగానే యున్నది. కానీ! యేమిటి? ఏదో యుపద్రవము తెచ్చిపెట్టినావఁట కొంపకు.

ఆమాటకామె హృదయము భగ్గుని మండిపోయెను.

వెం:—ఎవరీమాటలుచెప్పి యప్పుడే నిప్పంటించినవారు ! వాఁడు నాకంటఁబడినచో వానిముఖాన నిప్పులు పోయనా? వానితలగొఱిగింపనా?

పా:—విషయమేమిటో చెప్పకుండఁ గోపపడెదవేలా?

వెం:—ఎందుకులెండు చెప్పుట. నాదురదృష్టము కాకపోయి
నచో నౌకరీచేసియైన నాలుగుపైసలు సంపాదింపలేని
దద్దమ్మకూడ నన్ను పీటపెట్టి కొట్టఁగలఁడా?

పా:—నాకేమీ యర్థమగుట లేదు. ముసుఁగులో గ్రుద్దులాట
లేల? వివరముగాఁ జెప్పుము.

వెం:—చెప్పుటకేమున్నది? మీముద్దులతమ్ముఁడు మిట్టమధ్యా
హ్నము రెండుపిట్టలను దెచ్చి వండిపెట్టుమన్నాఁడు.
వండినాను. పెట్టినాను. [illegible] కలిపినాఁడు. నేయి
తెమ్మన్నాఁడు. ఇంటిలోనున్న నేయికొంత కంచములోఁ
బోసినాను. మఱి లేదన్నాను. ముండపడి [illegible]
పుట్టింట నేతి నదులు [illegible]చున్నవి కాఁబోలునే'
యన్నాఁడు. నాకుఁ గోపమువచ్చినది. నాపుట్టింటి [illegible]
జాకళ్ళు మంగళ్ళు తిన్నంతలేదు. మీనేయి యంతా'
యన్నాను. అది విన్నాఁడు పీట నానెత్తినివేసి
కొట్టినాఁడు. అదృష్టవశముగా [illegible] డినది.
లేనిచో నీపాటికి వచ్చి స్వర్గాన ఉండెడి దాననే. ఇదిగో
చూడండి. వేళ్లు ఏలాచితికి [illegible]! ఈ మాటలు
నిజమో యబద్ధమో మీ తమ్మునిఁ బిలిచి యడుగుఁడు.
అనెను.

ఆమాటలు పాపారావు హృదయము దహించివేసినవి.
"ఓహో! యింతవఱకు ముదిరెనా వ్యవహార" మన్నాఁడు.
వెంకయ్యమ్మ రావు కన్నీరు కార్చెను. ఏడుపు స్త్రీలకు చెప్ప
లపై నుండునుగదా!

పాపారావు చాల ధైర్యము, స్థైర్యము, గాంభీర్యము, సహనశీలము గలవాఁడు. సాధారణముగా నాతఁడెప్పుడు కోపించి యెఱుఁగఁడు. కాని తన మామవిని కన్నీళ్ళు వాని క్రోధాగ్నికి నాజ్యమై మండించెను. నాఁటి రేయెల్ల నాతఁడు నిద్రపోలేదు. ఇటు నటు దొర్లుచుండెను. తెల్లవాఱినది. పాపా రావు తండ్రిచెంత కరిగెను.

"నాన్నా! యింక నాకీయింటిలో సరిపడదు" అనెను. ఎన్నెన్నో కుటుంబములలోఁ బొడచూపెడు యిట్టి తగవుల నెన్నింటినో తీర్చి దిద్దిన పాపారావు నోటనే యిట్టిమాటలు వెలువడెను. ఆహా! యితరుల కుపదేశించుట యెంత తేలిక!

ఆమాటలు విని తండ్రి కిఁగారుపడి లేచి "ఏమి నాయనా! ఎందుకు? కారణమేమిటి?" అన్నాఁడు.

పాపారావు:—నాన్నా! నాకు మానము మరియాద ఉన్నవి. నేను ఉప్పు పులుసు కారము తినుచున్నాను. మన యింటిలో మంచి చెడ్డలు లేవు. అన్యాయ మధిక మైనది. పెద్ద పిన్న తారతమ్యము లేదు. నాకు త్రొక్కా డినఁగాని డొక్కాడదు. ఎప్పుడు పొరుగూరిలో నుండ వలెను. నేను గుమ్మము దాటఁగానె నాభార్యపైఁ జేటలు కీటలు ఎగురుచున్నవి. నేనెట్లు సహించి చూడఁ గలను? ఏమైన నొకటి రెండు పరుషవాక్యములు సహింపఁగలను. చిన్నలు పెద్దలు నాభార్యపైఁ దాడన మాడుచుండ నెట్లు చూచుచు నూరకొనఁగలను!

తన్నెల్లప్పుడు గౌరవించు పాపారావు బొమముడిపాటు గాంచి తండ్రి యేమీ యనలేక యెట్టకేలకు—

తండ్రి—అబ్బాయీ! బుద్ధిమంతుఁడవైన నీవుకూడ నిట్లే యనుకొనుచున్నావా? ఆడువార లిట్లేకదా కొంపలు కూల్చుచుందురు. వారిని నెత్తి యెక్కించుకొనరాదు.

పాపారావు:—నాన్నగారూ! తమ దయచే నింతమాత్ర మెఱుఁగుదును లెండు. తమరనుకొన్నంత మూర్ఖుఁడను గాను. ఈగ్రామములో నిట్టి చిక్కులలోఁ జిక్కిన యెన్ని కుటుంబాల నుద్ధరించినానో తమ కెఱుంగనిది కాదు. ఏస్త్రీ మానప్రాణములు రక్షించుట నావిధియో యా స్త్రీనే పశుత్వముతో హింసించుట నేనెట్లు సహింతును? ఇంత జరిగినను నేను కిక్కురు మనలేదు. ఇది సామాన్య విషయమా! నాన్నగారూ! అన్నాడు.

తండ్రి:—అబ్బాయీ! రంగారావు నీ తమ్ముఁడు కదా! తప్పున్నచో ఈ దౌడ ఆదౌడ రెండు వాయించు. కానీ ..........

పా:—నాన్నా! వాఁడు నాకు తమ్ముఁడు కాదు గిమ్ముఁడు గాదు. ఊరకొనుఁడు.

తండ్రి:—ఆఁడుదాని మాటలు వినియా?

పా:—కాదు వాని క్రూరత, అవివేకము చూచి,

కొండొకసేపిరువురు మౌనముద్ర వహించినారు. తండ్రి కుమారునికిఁ జిత్తశాంతి కలిగింపవలయునని యత్నించు

చుండెనే కాని చిన్నకొమరుని తప్పిదమును మాత్ర మొప్పు
కొనఁడు. ఇంతలో నాజాడ కనిపెట్టి పౌరులు కొందఱు తల
యొక పనిమీఁద వచ్చిన ట్లచ్చటకువచ్చిరి. పాపారావు భార్య
మాటవిని తండ్రితో వేఱుపడ సిద్ధపడుచున్నాఁడని విని
యమ్మలక్కలు చంకలెగురవైచిరి. ఆ తండ్రికొడుకుల తగ
వుల నాలకింప నాఁగోడ యీఁగోడ చాటునకు రాఁదొడఁ
గిరి. ప్రతిగ్రామములోను నున్నట్లె యీ గ్రామములోఁ
గూడఁ గొందఱు పోరుగు గిట్టని వారున్నారు. వారందఱు
వీరిని ద్వేషించుచుండెడివారు. తండ్రి కొడుకు లిరువురు
లోకానుభవము లేని పండితులని యీసడించెడివారు. ఇట్టి
వారందఱకు వీరిని ఎగతాళి చేయుటకు మంచి యదను లభించి
నది. ఒకరివెనుక నొకరుగా వచ్చిన యీపౌరుల రాకకుఁ గల
యుద్దేశ్యమును అనుభవజ్ఞుఁడగు తండ్రి యిట్టె కనిపెట్టెను.
దుర్మార్గులగు పౌరుల యెకసక్కెమున కవకాశ మీయరాదని
నిశ్చయించుకొనెను.

కొడుకును గాంచి "అబ్బాయీ! యయినదేమో
యైనది. కుఱ్ఱవాఁడు పొరపడినాఁడు. క్షమించు. నేను పెఱ
వాఁడను గాను. నీ యిచ్ఛవచ్చినట్లు చేయుము' అనెను.

కళాశాలలోని వాదోపవాదములలోఁ దాఁటబట్టినకుండే
టికి మూఁడే కాళ్ళను నలవాటుగల పాపారావు తండ్రిమాటల
లోని యంతరార్థము గ్రహింపఁ జాలక పోయెను.

పా:—నాన్నా! యేమైనను సరే. నేనింక నీ యింటిలో నుండలేను.

తం:—అబ్బాయీ! బుద్ధిమంతులు మూర్ఖులమాటలను లక్ష్య పెట్టరు. చిన్నవాఁడు తెలియనివాఁడు. వాని పొరపాటును క్షమించు.

పా:—నాన్నా! వాని దుష్టత్వము నేనింక సహింపలేను. ఈ యింటిలో వాఁడైన నుండవలెను. నేనైన నుండవలయును. నా కంటె వాఁడు మీకు ప్రేమ పాత్రుఁడైనచో నాకు సెలవు నిప్పింపుఁడు? నాదారి నేఁజూచుకొందును. నేనే మీయొద్ద నుండవలెనందురా? వానిని బొమ్మని చెప్పుఁడు. ఇదే నా తుది నిర్ణయము.

రంగారావు తలుపుదగ్గఱ నిలిచి యన్నగారి మాటలన్నియు వినుచుండెను. అన్నగారియం దతనికి గౌరవభావము గలదు. అన్నగారి కెదురుగా నెన్నఁడు మంచము మీఁదనైనఁ గూర్చుండి యెఱుఁగడు. తమలపాకు వేసి యెఱుఁగడు. పాపారావునకుఁ గూడఁ దమ్మునియం దెంతో వాత్సల్యముండెడిది. తమ్మునెప్పుడును కోపపడి యెఱుఁగడు. విజయనగరమునుండి వచ్చునప్పుడెల్లఁ దమ్మునికై యేదో యొక వింత వస్తువు తెచ్చుచుండెడివాఁడు. రంగారావు ప్రతిదినము వ్యాయామ సమయములోఁ ద్రిప్పు ముద్గరము లన్నగారు చేయించినవె.

గత సంవత్సరము విజయదశమినాఁడు రంగారావు కుస్తీలో జగజెట్టినిఁ గొట్టినప్పుడు పాపారావు ఆనందము పట్టలేక తమ్ముని గౌఁగిలించుకొనెను. అట్టి యుదార హృదయుఁడగు నన్నగారి నోటినుండి యిట్టి హృదయ విదారక వాక్యములు వెలువడుట కతఁడు సహింపలేక పోయెను. వెక్కి వెక్కి యేడ్వసాగెను. పశ్చాత్తప్తుఁ డయ్యెను.

మొన్నటినుండి యతఁడు 'అన్నగారు ఎప్పుడువచ్చునో? వాని మొగము నెట్లు చూతునో? అతఁడేమనునో!' యని దడ దడ లాడుచునే యుండెను. కాని యాతఁడనుకొనిన దాని కంతకు వ్యతిరేకము నన్న వాకొనుటఁ గాంచి యతఁడు నిర్విణ్ణుఁడయ్యెను. అతఁడెంత మూర్ఖుఁడైనను అన్నగారు వేఱుపడుదుననుట యన్యాయమని భావించెను. తన్నన్నగారు చాటునకుఁ బిలిచి చివాట్లు పెట్టినను గొట్టినను బాధపడి యుండెడివాఁడుకాఁడు. కాని "నేను వాని మొగము చూడను— వానితోఁ గలిసియుండను" అని యాడిన వాఁడిమాటలను సహింపలేక పోయెను. ఏమియుననలేక యేడ్చుచు నింటిలోనికిఁ బోయెను. మొగము కడుగుకొనెను. కనులు తుడిచికొనెను. వదినెగారియొద్ద కేఁగెను. పాదములపైఁ బడెను. "వదినె! మా యన్నగారు నా మొగము చూడనన్నారు. నేనిఁక నీ యింటనుంట యేమి లాభము. ఎందేనిఁ జనుదును. నా మొగ మాయనకుఁ జూపఁజాలను. నా తప్పు క్షమింపుము" అని డగ్గుత్తికఁ బెట్టికొనెను.

4

రంగారావు వదినెయొద్ద వినమ్రుఁడై నిలిచిన సమయ మందె పాపారావుకూడఁ గ్రోధావిష్టమానసుఁడై యచ్చటికి వచ్చెను. తమ్ముని జూచినాఁడు. వానినీడ కూడఁ దనకుఁ దాకఁ రాదనునట్లు దూరముగాఁ దొలఁగి పోయెను.

వెంకయ్యమ్మ రంగారావు మఱఁది చేసిన నేరము మాత్రము తెలియఁజేసెనేకాని మనస్సులో బాధపడుచునే యున్నది. ఆమె హృదయము నవనీతసమానము. కథ యింతయుద్ధతిరుగు ననుకొనలేదు. 'ఎందు కింతకోప పడిరో' యని భర్తనుగూడ నామె కొంచెము విసుగుకొనినది. విజయనగరము ప్రయాణము కట్టుమందురేమోయని భయపడినది. మఱఁది కన్నీళ్ళతోడి క్షమార్పణమామె మనస్సును కరఁగించివైచినది. తానుగూడఁ గంటఁ దడిపెట్టికొన్నది. మనస్సులోని మాలిన్యము కడిగివేయుటకు నేడ్పును మించిన సాధనము లేదు గదా!

భర్తనుజూచి యామెఁ "రంగారావు ఏడ్చుచున్నాఁడు."

పా:— నేనేమి చేయను?

వెం:—లోపలికి రమ్మనుఁడు. నానోరు పాపగాను, నేనెక్కడి నుండి తెచ్చిపెట్టినానీ పేచీ.

పా:— నేను పిలువను.

వెం:—పిమ్మటఁ బశ్చాత్తాప మొందఁగలరు. అతనికిఁజాల గ్లాని కలిగినది. అతఁడెక్కడకుఁ బోకుండఁ జూడుఁడు.

పాపారావు లేవలేదు. రంగారావు మరల "వదినె! యిక నా మొగమన్నగారు చూడరు. నేను నా మొగము వారికిఁ

జూపఁ జాలను." అని వెడలిపోవుచుండెను. వెంకయ్యమ్మా రావు కటాలున వెళ్ళి చేయిపట్టుకొని రంగారావు నాఁపెను. అతఁడు కన్నీళ్లు గార్చుచు "వదినె నన్ను వెళ్ళనిమ్ము" అనెను.

వెం:—ఎక్కడికి వెడలెదవు?

రం:—ఎక్కడ నెవ్వరికిని నా మొగము కానరాకుండునో యక్కడ కేఁగెదను.

వెం:—నేను వెడలనీయను.

రం:—నేను యింటనుండ నర్హుఁడను గాను.

వెం:—వెడలితివేని నన్నుఁ జంపినట్లే యొట్టుసుమీ! ఒకయడుగు కూడ ముందునకు వేయవలదు.

రం:—అన్నగారి మనస్సు నిర్మలమయినదని తెలిసినదాఁక నేనిందుండఁ జాలను.

వెం:—బాబూ! భగవంతునిసాక్షిగాఁ జెప్పుచున్నాను. నా హృదయములో మలినమేమీ లేదు.

ఆ మాటలు వినుచున్న పాపారావు హృదయము నీరై పోయినది. రంగారావును కౌఁగిలించుకొన్నాఁడు ఇద్దఱు వెక్కి వెక్కి యేడ్చినారు.

ప్రేమసముద్రములో మునిఁగిపోయినారు. ఇంతలోఁ దండ్రి వచ్చినాఁడు. కొడుకులఁ జూచినాఁడు. ఆనందించినాఁడు. ఆయూరి వాడ వాడల అయినింటి యాఁడుపడుచు లిట్లోకదా యుండుట! ఎంత విశాలహృదయ యని వెంకయ్యమ్మారావును శ్లాఘించిరి.

——

# 3 పంచాయతి

## 1

ఆంధ్ర దేశములో కొండపల్లె నెఱుఁగనివారులేరు. ఆ నగరమున షేక్ మదీనా, నారాయణరావు అను నిరువురు మిత్రులుండెడివారు. ఇద్దరిది కాడిపట్టు వ్యవసాయము. ఒకరినివిడిచి యొకరొక క్షణమైనను ఉండలేకుండిరి. ఒండొరులపైఁగల వారి ప్రేమ విశ్వాసములు నిరుపమానములు. ఇద్దఱి పొలములు నొక్కనాఁడు దున్నవలయును. ఒక్కనాఁడే విత్తవలయును; ఒక్కనాఁడె కలుపుతీయవలయును; ఒక్కనాఁడే కోయవలయును; ఒక్కనాఁడే నూర్పవలయును. అట్టిది వారి మైత్రి. ఒక కొన్నాళ్ళకు మదీనా హజ్జు యాత్రలకు బయలుదేరెడివాఁడు. యాత్రల కేఁగునప్పుడు తన యాస్తియంతయు నారాయణరావునకు నొప్పగించెడివాఁడు. నారాయణరావుకూడ నట్లే తానెక్కడికేని వెడలునప్పుడు తన కుటుంబభారమంతయు మదీనామీఁద విడిచి వెడలుచుండువాఁడు. ఆ యిద్దఱి మధ్య స్నేహము దృఢమగుటకు మూలమైనది పరస్పర విశ్వాసభావములతోడి వినిమయము స్నానపాన భోజనాదులయందు మత విషయములయందు ఎవరి దారి వారిదే. వారి మైత్రి లోకమునకు నొరవడియైనది.

వీరి స్నేహమీనాఁటిది కాదు. చిన్ననాఁటిది. వీరిరువురు మదీనాతండ్రియైన యబ్దుల్లాయొద్ద చదువుకొనుచుండెడివారు.

## 2

మదీనాకొక పినతల్లికలదు. ఆమె మూఁడుకాళ్ళముసలి. ఏదో కొంచెమాస్తికూడ ఆమెకు లేకపోలేదు. దగ్గఱ వారసు లెవరు నామెకులేరు. మదీనా యామెకు ఆమాట యీమాట చెప్పి ఆమెను బ్రతికియున్నన్నాళ్ళు తల్లివలె నెత్తిమీఁదఁ బెట్టికొని పూజించెదనని వాగ్దానముచేసి నమ్మించి యామె యాస్తి 'కాస్త' తనపేర వ్రాయించుకొనెను. దస్తావేజు రిజష్టరీ యగునంతవఱకు నామెకుఁ బెండివంటలేని భోజనములేదు. వాని తేనెమాటలు, ఆదరవాక్యములు, ఆమెనానందలహరిలో నీఁదు లాడించుచుండెను.

దస్తావేజుపైని రిజిస్ట్రారు మొహరుపడినది. ముసలమ్మ వ్రేలిముద్రలపైఁగూడ ముద్రలుపడినవి. క్రమముగా నామెకు భోజనముతోపాటు 'చకారగుళ్లు'కూడ మదీనాయొక్క బేగము వల్ల లభ్యమగుచుండెను. అప్పుడప్పుడవే యాముసలియవ్వకుఁ గూరగాయలు నంజుడులు నయ్యెడివికూడ. మదీనాకూడ ఇల్లాలికి బ్రక్కతాళము వేయుచు 'తందానే తాని తందనాన' యనుచుండెడివాఁడు.

పాపమా ముసలమ్మ వార్ధకమునఁ జేసేత నీబాధలు తెచ్చిపెట్టుకొనెను.

"రెండుమూఁడెకరాల యీసరక్షేత్ర మిచ్చినదోలేదో యెప్పుడు పప్పులేకుండ ముద్దదిగదు పాపమీ ముసలమ్మకు. దీనికిఁ బెట్టిన రూపాయలయితే మాకొక గ్రామము వచ్చెడిది.

హాయిగా జమీందారులలాగున బ్రతికెడివారము. దిక్కుమాలి నది యిది దాపురించినది మాకు" అని బేగము సణుగులు ప్రారంభించినది.

ముసలమ్మ చాలకాలము సహించినది. సహనమునకుఁ గూడ నొక హద్దుకలదుగదా! మఱి సహింపలేకపోయినది. బేగము విసరులు, కసరులు, ముక్కులు, మూలుగులు, సణుగులు, గొణుగులు, మదీనాతోఁ జెప్పినది. ఆఁడువారల కయ్యాలలోఁ గలుగఁజేసికొనఁగూడదనియో మఱేమోగాని యతఁడు భార్యనేమీ మందలింపలేదు.

ముసలమ్మ యొకనాఁడు మదీనాను పిలిచి "అబ్బాయీ! యిఁక నేను నీయింటిలో నుండలేను. మీయాబిడకు నాకు సరిపడుటలేదు. నాకగు వ్యయమునకు సరిపడు రూపాయలిచ్చు చుండుము. నేను వేఱే వండుకొందు" నన్నది. అదివిని మదీనా 'ఏమమ్మా! రూపాయలిక్కడ పండుచున్నవనుకొనుచున్నావా? యేమి?' అనెను.

ము:—నాయనా! ఏయుప్పుచప్పని భోజనమో నేను తినవలెనా? అక్కఱలేదా?

మ:—నీవింతకాలము ఉట్టిగట్టుకొని యూరేఁగుదువని యెవ రెఱుఁగుదురు?

ము:—పోనీలే నాయనా? ఇది యూరుకాని వల్లకాడు కాదు. ఇక్కడ పంచాయతి యుండకపోలేదు. ఆపంచాయతీ సభ్యులకె నాగోడు వెళ్ళఁబోసికొనెదనులే.

ఆమాటలు వినఁగానే మదీనా తాను పన్నిన వలవైపు నకుఁ బరువెత్తుకొని వచ్చు లేడినిఁ జూచిన వేఁటకానివలె నవ్వుచు'ఆలాగునే కానిమ్మమ్మా! రేయింబవళ్లు నీమూలుగులు వినలేక నాప్రాణము విసిగిపోవుచున్నది' అనెను.

పంచాయతిలో నెవరిపక్షము నెగ్గునో మదీనాకు బాగుగాఁ దెలియును. కారణము? మదీనా యాచుట్టుప్రక్కలఁ బలుకుబడి గలవాఁడు. పరిసర గ్రామస్థులలోఁ జాలమంది యతని తండ్రి శిష్యులే. అట్టిస్థితిలో నతనికి వ్యతిరేకముగాఁ దీర్పు నెవరీయఁగలరు? ఎవరికి ధైర్యముండును? ఆముసలిదాని పక్షము వహించువారెవరుందురు?

## 3

కొండపల్లెకు దాని చుట్టుప్రక్కలనున్న కుగ్రామములకుఁ గలిసి కొండపల్లెలోనె పంచాయతికోర్టుగలదు. అందుచే నా పంచాయతికోర్టునందు నాయూ కుగ్రామవాసులుగూడ సభ్యులుగా నున్నారు. అది తెలిసికొని మదీనా పినతల్లి కఱ్ఱనూఁతగాఁ గొని యాచుట్టుపట్టుల కుగ్రామములకేగి తన విషాదగాథ వారివారికి వినిపించుకొనినది. ఆచుట్టుప్రక్కలనా మెను జూడని పెద్దమనుష్యుఁడే లేఁడయ్యెను.

నడుమువంగి పుల్లవలె నున్నను బ్రతుకుఁ దెరువుకై పరుల పంచలఁ బట్టి తిరుగక తప్పదుగదా!

కొందఱు పెద్దలు వినీవిననట్లుగా నూరకొనిరి. కొందఱు మాత్రమూఁకొట్టి 'సరే చూతుములే'యనిరి. కొందఱు 'కాల

ప్రభావ' మనిరి, కొందఱు 'కాటికి కాళ్లుచాఁచుకొని కూర్చుండిన దానివి నీకీ కోర్టులు వెంటఁదిరుగనేల? వేళకింత పిండముతిని భగవన్నామస్మరణము చేసికొనరాదా?' యనిరి. కొందఱకా ముసలమ్మ వేషము హాస్యరసాస్వాదనమున కవకాశమిచ్చుచున్నది. వంగిన వపుసు, బోసినోరు, జనపనారవంటి జుట్టు ఎవరికి హాస్యసంప్రీతిని గూర్పదు?

ఆ ముసలిదాని కరుణామయగాథను శ్రద్ధగావిని యామె కష్టములు గట్టెక్కఁజేసి యోదార్చు దయాహృదయుఁడు న్యాయమూర్తి దీనబాంధవుఁడు కోటికొక్కఁడు గూడ లేఁడు. కఱ్ఱ నానకొని యూపిరితీసికొని నారాయణరావు నొద్దకుఁ గూడ వెళ్ళి "అబ్బాయీ! నీవుకూడ నొక్కసారి పంచాయతీ కోర్టువద్దకు రావలెను. నీవొక్క గడియసేపు నిలుచుండినఁ జాలు" అన్నది.

నారా:—నేనెందుకులే మామ్మా! వద్దు చాలమంది పౌరులు పెద్దలున్నారుగా వారు వచ్చెదరుగా!

ము:—నాగోడు నందఱివద్ద వెళ్ళఁబోసికొంటిని వచ్చుటో రాకపోవుటో వారియిష్టము.

నా:—సరే మామూలుగా వచ్చెదనుగాని నేనచ్చటనోరెత్తను.

ము:—ఏమబ్బాయీ! ఆలాగున ననుచున్నావేమి?

నా:—అమ్మా! నేను జవాబు చెప్పలేను. అది నాయిష్టము. మదీనా నాకుఁబూర్వమిత్రుఁడు. నేనతనికి వ్యతిరేకముగా మాట్లాడి పేచీలు తెచ్చిపెట్టుకోలేను.

ము:—అబ్బాయీ! పేచీలువచ్చునని భయపడి న్యాయము
చెప్పలేవా?

సాధారణముగా మానవునిలో నిద్రితమై యుండు ధర్మ
మంతయు నొక్కపెట్టున దొంగిలింపఁబడినను దాని నాతఁడు
కనిపెట్టలేఁడు. కాని యితరులు నుచ్చరించినపుడా ధర్మజ్ఞానము
తప్పక సచేతనమగును. అప్పుడు దాని నెవరును జయింపఁ
జాలరు. ముసలిదాని తుదివాక్యములు నారాయణరావులో
నిద్రితమైయున్న న్యాయ ప్రియత్వమును, ధర్మజ్ఞానమును రేకె
త్తించెను. అతని హృదయములో ఆవాక్యము సర్వదా ప్రతి
ధ్వనించుచుండెను.

అది సంధ్యాసమయము. సూర్యుఁడప్పుడే పశ్చిమ
సముద్రమున మునుగుచుండెను. కొండపల్లెలోని నాలుగువీధుల
మొగలోనున్న విశాల వటవృక్షముల క్రిందఁ బంచాయతి
సమావేశమైనది. మునీమ నాలుగుగంటలకే కంబళీలుమున్నగు
నవి తెప్పించి యచ్చటఁ బఱపించినాఁడు. చుట్టకట్టలు అగ్గి
పెట్టెలు గూడ నాతఁడు మఱవలేక యచ్చటఁ బెట్టించినాఁడు.
నారాయణరావునకుఁ బ్రక్కనే కొంచెము దూరమునఁ
గూర్చుండెను. కాని అక్కడకువచ్చెడి ప్రతి పంచాయతీసభ్యు
నకు లేచి వంగివంగి సలాములు చేయుచునే యుండెను. వృక్ష
ములమీఁది పక్షుల కలవరముల పంచాయతితో పాటు క్రింది
పంచాయతి సాగుచుండెను. జనులు క్రిక్కిరిసియుండిరి. అందు

చాలమంది ప్రేక్షకవర్గము పంచాయతి సభ్యులుగా నాహూతు లైనవారిలో కేవలము మదీనామీఁద నేదో యొక కారణము చేఁ బగతీర్చుకొనఁ దలఁచినవారే హాజరైరి. చాలమంది యనవసరముగా న్యాయముచెప్పి మదీనాతో విరోధమేల తెచ్చికోవలెనని రాలేదు. కుక్కలీ హడావుడిచూచి యేదో సంతర్పణగా భ్రమించి గుంపులుగుంపులుగాఁ జేరవచ్చినవి.

పంచాయతివారు కూర్చుండఁగానే ముసలమ్మ తనగాథ నిట్లు వారికి వినిపించెను:

'నాయనలారా! నేఁటికి మూఁడేండ్ల క్రితము నాయాస్తి యంతయు మదీనా పేర వ్రాసిన విషయము తమరందఱు నెఱిఁగినదే. అందుకు బదులుగా నతఁడు నా జీవితకాలము కూడు గుడ్డలనిచ్చునట్లొడంబడినాఁడు. ఈ సంవత్సరమంతయు మదీనా వాని భార్య నన్ను ఎన్నెన్నో తిప్పలుపెట్టినారు. ఇఁక నెన్నాళ్లు రాత్రియుఁ బవలును నేనీ బాధలు పడఁగలను? బ్రతికినన్నాళ్ళు బ్రతుకనుగదా? బ్రతికిన నాల్గునాళ్ళు కూడుగుడ్డ కావలయును గదా! అవే కఱవైపోయినవి. ఆఁడుదానను. అనాథను. కోర్టుల వెంటఁ దిరుగలేను. మీరుతప్ప నాకు మఱెవరు దిక్కులేరు. మీరు న్యాయము పాటించరేని నేను నూయో గోయో చూచికొనవలసినదే. అన్యథాశరణములేదు. నావల్ల దోషమున్న లెంపలు వాయించుఁడు మదీనాయందు దోషమున్న వానిని మందలించుఁడు. మీ యాజ్ఞకు నేను బద్ధురాలను.'

ఇంతలో రామనాథశాస్త్రి లేచి మదీనాను బిలిచి "ఓయీ యీపంచాయతిలో నెవరిని బెద్దగా నెన్నికొందువో చెప్పు. ఒక్కసారొకరి నెన్నుకొన్న తరువాత వారిమాటప్రకారం నడచుకొనవలసినదే' అనెను. మదీనా లేచి యటు నిటు పరికించెను. సభలోనున్న వారిలోఁ జాలమంది యేదో కారణముగాఁ దనతో విరోధపడినవారే కనఁబడిరి. అందుచే నాతఁడు,

'పంచాయతి ఆజ్ఞ పరమాత్మునాజ్ఞ. కాన ముసలమ్మనే యెవరినో యొకరినిఁ గోరుకొనుమనుఁడు నాకేమీ బాధలేదు' అన్నాఁడు.

ము:—పంచాయతిదారుల పేరు చెప్పు నేనుగూడ వినెదను.

మ:—(కొంచెము కోపముతో) ఇప్పుడు నానోరు విప్పించకు. నేఁడు నీ నసీబు బాగుగానున్నది. నీవేకోరుకో యెవరు కావలెనో.

మదీనా యీసడింపును ముసలమ్మ గ్రహింపకపోలేదు.

ము:—అబ్బాయీ! భగవంతునికి భయపడు. పంచాయతిలోని పెద్ద యెవరికిని స్నేహితుఁడుగాఁడు విరోధియుగాఁడు. వానినోటిలో భగవంతుఁడుండును. నీకెవరిమీఁద నమ్మకము లేకపోయినఁ బోనీ! నారాయణరావునైన నొప్పుకొనెదవా? లేదా? నేనతనినే పెద్దగా నెన్నుకొన్నాను.

ఆమాటలు వినఁగానే మదీనా యానందము పట్టలేకపోయినాఁడు. కాని గడుసరిగాన తన భావమును పైకిఁదోపనీయకఁ 'నాకు రామనాథశాస్త్రి యెంతో నారాయణరావు

కూడ నంతె. సరే, కానీ, నారాయణరావునే యెన్నుకో—
అన్నాఁడు.

అదివిని నారాయణరావు మొగమోటమిలోఁ బహుట
కిష్టములేక "ముసలమ్మా! నేనునూ మదీనాయును స్నేహితుల
మన్నమాట యెఱుఁగుదువా?" అన్నాఁడు.

ముసలిది గంభీరస్వరముతో 'అబ్బాయీ! నారాయణ
రావూ! స్నేహముకొఱ కెవరైనఁ దన నమ్మకమును పెద్ద
మనిషితనము అమ్ముకొందురా? పంచాయతిపెద్ద హృదయ
ములో భగవంతుఁ డుండునుసుమా! వాని నోటినుండి వెలు
వడిన వాక్కు సాక్షాత్ భగవద్వాక్యమే' అన్నది.

నారాయణరావె నాఁటి పంచాయతికిఁ బెద్దగా
నెన్నుకోఁబడినాఁడు. బసవయ్య మున్నగు మదీనా విరోధుల
కిది యెంతమాత్రము నచ్చలేదు. మూతులు ముడుచుకొని
లోలోపల ముసలమ్మను దిట్టుకొనిరి.

నారాయణరావు మదీనాను సభలోనికిఁబిలిచి "మదీనా!
నీవు. నేను ఆబాల్య స్నేహితులము. పనివచ్చినపుడు నాకు నీవు
నీకు నేను సాయపడినాము. నావల్లనైన సాయ మెన్నో
మాఱులు నేను నీకుఁ జేసినాను. కాని యీసమయములో నీవు
ముసలమ్మ యిద్దఱు నాదృష్టిలో నొక్కటే. పంచాయతి
సభ్యులతోఁ జెప్పుకోవలసిన దేమా చెప్పుకో" అన్నాఁడు.

నారాయణరావు సమాధానమిచ్చియుఁ బైవారి కనుమా
నము కలుగకుండుటకై యనుచున్నాఁడేకాని జయము తనదే
యను ధీమాతోఁ మదీనా శాంతచిత్తముతో నిట్లనియెను:

"పంచాయతీ సభ్యులారా! ముసలమ్మ తనయాస్తి నా పేర వ్రాసి మూడేండ్లయినది. నేనామెకు జీవితపర్యంతము తిండి బట్ట యిచ్చుటకొప్పుకొన్నాను. నేటివఱకు నేనామె నెప్పుడు బాధ పెట్టలేదన్న మాటకు భగవంతుఁడే సాక్షి. నే నామెను దల్లివలెఁ జూచుచున్నాను. ఆమెను సేవించుటకంటె నాకుఁ గర్తవ్యాంశ మేమున్నది? కాని యీఁడువారిలోఁ బొరపొచ్చెములు పుట్టెను. సరిపడుటలేదు. వారి నిరువురను సమాధాయించుట నాశక్తికిమించిన పనియైనది. అందు నాతప్పేమున్నది? ముసలమ్మ నెలసరి ఖర్చు వేఱె యిమ్మనుచున్నది. ముసలమ్మ యాస్తియెంతయో పెద్దమనుష్యు లెఱుఁగనిదికాదు- నేను నెల సరి ఖర్చు ఈయదగినంత రాబడి యామెయాస్తిమీఁద వచ్చుటలేదు. పైఁగా దస్తావేజులోఁగాని ఖరారునామాలోఁ గాని నెలసరిఖర్చు వేఱే యివ్వవలెనన్న ప్రసక్తియే లేదు. లేక పోయిన నే నీజంజాటములోఁ బడెడివాఁడను గాను. నేను చెప్ప వలసినదిదే. పైని పెద్దలచిత్తము నాభాగ్యము"

నారాయణరావు తఱచుగాఁ గోర్టులకు వెడలుచుండుట కలదు. కావున నతనికి న్యాయశాస్త్రవిషయములఁ గొంచెమనుభవము గలదు. దానఁజేసియతఁడు మదీనాను ప్రశ్నింపనారంభించెను. ప్రతిప్రశ్నయు మదీనా హృదయముపై సమ్మెటపోటు వలె బడుచుండెను.

బసవయ్యకాప్రశ్నలు చాలసంతోషము కలిగించు చుండెను. నారాయణరావునకు పిచ్చియెక్కినదా యని మదీనా

యాశ్చర్యపడెను. "ఇంతవరకుఁ దనతోఁ గలిసి కూర్చుండి తియ్యతియ్యని మాటలుచెప్పి యింతలోనె యిట్లుమాఱిపోవుటకుఁ గారణమేమా యని తెల్లపోవుచుండెను. ఇంతలోనే యిట్లుమాఱిపోయి నాదుంపఁ దెంపఁ బ్రయత్నించుచున్నాఁడే! కారణ మేమైయుండును? ఏదైనా ప్రాఁతపగ తీర్చుకొనుచున్నాఁడా! ఇన్నాళ్ళస్నేహము ఇట్టుమట్టిగలిసి పోవలసినదేనా?" అని పరిపరివిధముల మదీనా హృదయము ఆవేదనపడసాగెను. ఇట్టి యావేదనాపూర్ణహృదయములోని సంకల్పవికల్పములనుండి మదీనా యింకను దేఱుకొనలేదు. ఇంతలో నారాయణరావు తీర్పువినిపించెను. మదీనా! పెద్దమనుష్యులు ఈవిషయమును బూర్తిగా విచారించిరి. వారి దృష్టిలో ముసలమ్మకు నెలనెలకు ఖర్చుకు సరిపడు రూపాయలిచ్చుటయే న్యాయమని తోఁచినది. పైఁగా ముసలమ్మ యాస్తివల్ల నంతమాత్రపు టాదాయము వచ్చునని నిశ్చయించిరి. అట్లే తీర్పిచ్చిరి. తమ తీర్పుప్రకారము మదీనా ముసలమ్మకు నెలసరిఖర్చు యీయవలెనని ముసలమ్మ వ్రాసియిచ్చిన దస్తావేజు రద్దయినట్లుకూడఁ దీర్మానించిరి.

## 4

ఆతీర్పు వినఁగానె మదీనా నిస్పృహుఁడయ్యెను. "నా ఒకేప్రాణ మనుకొనిన మిత్రుఁడే నాగొంతుక కోయుటయా! మిత్రామిత్రు లెవ్వరు? సమయము వచ్చినప్పుడుగాని

బైటపడదు గదా? ఎంతకుఁ కాలమహిమ! ఈకాలములో నిక్కమైన స్నేహితు లెక్కడనుందురు?" అని తలంచెను.

కాని రామనాథము మున్నగు పంచాయితి పెద్దలు నారాయణరావు సీతారాయణతోను గాంచి "యిదే నిజమైన పంచాయతి. పాలకుఁబాలె నీరుకు నీరె. స్నేహము స్నేహమె ధర్మము ధర్మమే. న్యాయ విచారణలో స్నేహమునకుఁ దావు లేదు. నారాయణరావు వంటి సత్యవాదులింకను నుండుటచేతనే యీపృథివి యుండనుక నిలిచియున్నది. లేకపోయిన నెప్పుడో రసాతలమునకుఁ బోయియుండును" అని యనుకొనిరి.

కాని యీన్యాయ నిర్ణయము మదీనానారాయణ రావుల మిత్రత్వ మూలమును పెకలించివైచినది. ఈనిర్ణయ మైన పిమ్మట వారిద్దఱు నొకరితో నొకరు సంభాషించుకొనుట యెవ్వరును గని విని యెఱుఁగరు. స్నేహవృక్షము ఒక సత్వాఘాతమును సహింపలేకపోయెను. అది కేవల నికతాన్వృక్ష మయ్యెను. ఎప్పుడైన మదీనా నారాయణరావులు కలిసి కొనుట తటస్థించినచోఁ 'నమస్తే!' యనిన 'నమస్తే!' యను గౌరవపూర్వక సంబోధనములు లాంఛనములై పోయినవి. వారిరువురు లకుఁ గత్తి డాలులవలెఁ గనపడుచుండిరి.

మదీనాహృదయములో మిత్రుని కుటిలత సదా బాధించుచునే యున్నది. ఏవిధముగా నతనిపైఁ బగదీర్చుకొనెదను నవకాశము దొఱకునా యని యతఁడు వేచియుండెను.

5

మంచికార్యములు సిద్ధించుటకుఁ జాల కాలవిలంబన మగును. కానిచెడ్డపనుల కట్లుగాదు. మదీనాకుఁ బ్రతిక్రియ చేయు నదను వెంటనే లభించెను.

నారాయణరావు గతసంవత్సరముననే పొడుగుపాటి కొమ్ములు, చక్కనితోఁకలు, చిన్న డెక్కలు, కుఱుచగంగడోళ్లు గల యొకచక్కని మైసూరెడ్లజత విలిచిదెచ్చెను. వానిని జూచుటకుఁ జుట్టుప్రక్కల గ్రామములనుండి జనులు తండోప తండములుగా వచ్చిపోవుచుండిరి. దైవయోగముచేఁ బంచా యతిజరిగినవారమురోజులకె యందొకయెద్దుగతించెను. అది కని మదీనా యగపడినవారందఱితోడ, "నారాయణరావు నాకుఁ జేసిన మిత్రద్రోహమునకు ఫలిత మనుభవించెను జూచితిరా? మానవుఁ డెంత ద్రోహమునకు బాల్పడినను భగవంతుఁడు మంచిచెడ్డలను జూచుచునేయుండును సుఁడీ!" యని చాటు చుండెను.

నారాయణరావునకు మదీనా తన యెద్దునకు విషము పెట్టించి చంపించెనని యనుమానము కలిగెను. వారి భార్య లీవిషయమునుగూర్చి తర్కించుకొని కయ్యమునకు గాలు ద్రవ్వికొనిరి. ఎట్లో భర్తలిరువురు నివారింపఁ గలిగిరి.

నారాయణరావు తనయెద్దునకు నుద్దియగు రెండవ యెద్దునుగొనఁదలఁచి చాలప్రయత్నించెను. కాని సఫలతగాంచ లేదు. తుదకుఁ బ్రాణము విసిగి దానిని విక్రయింపఁదలపెట్టెను.

అప్పలస్వామి తూర్పుదేశస్థుఁడు. క్రొత్తగా నిచ్చటికి వచ్చి పొట్టపోషించుకొన నొక యొంటెద్దుబండిని సంపాదించు కొనెను. దానిమీఁద సరకులు వేసికొని పల్లెలకును బల్లెలోని సరకులను బట్టణములకును తీసుకుబోవుచు జీవించుచుండెను. ఈ యెద్దు సంగతి వాఁడు వినెను. దీనిని విలిచికొనిన ప్రతి దినము రెండు మూఁడు సబురులు తోలి విరివిగా వర్తకము సాగించుచు ధన మపారముగా నార్జింపవచ్చునని తలంచి నారాయణరావువద్దకువచ్చి బ్రతిమాలి యొప్పించి నెలరోజు లలో డబ్బిత్తునని నమ్మఁబలికి యాయెద్దును దోలుకొని పోయెను.

ఆ క్రొత్తయెద్దునుజూచి వాఁడు మురిసిపోవుచుండెను. ఎద్దు రోజునకు నాలుగైదుసారులు బండినీడ్చుకొని పల్లెలవెంటఁ దిరిగివచ్చుచుండెను. దానితో వానిజేబులు బాగుగానిండు చుండెను. అదిగాంచి చిట్టు, పొట్టు, గడ్డి, గాదము, కుడితి, నీరు ఎద్దునకుఁ బెట్టుటే మఱచిపోయినాఁడు. దానిని కిడును చుండవలెనను తలఁపేలేదు వానికి. నెలనాళ్ళగుసరికి నది నలిగి బక్కచిక్కి బడుగయ్యెను. కాఁడి చూచుసరికి గడగడ లాడఁ దొడఁగెను. అడుగుతీసి యడుగు వేయలేకుండెను.

ఒకనాఁడప్పలస్వామి రోజును వేసెడు బరువుకంటె రెట్టింపు బరువుగల బెల్లపుబుట్టలు బండిలో వేసికొని ప్రక్కపల్లెకుఁ బోయెను. ఇంచుమించుగా సగముసరకు సాయంకాలము కాక మున్నె యమ్మివేసెను. మిగిలినసరకమ్ముడుకాలేదు. ఇంక లాభము

లేడని యింటికి మరలెను. అది ఘంతదారి, అన్ని మిట్టపల్లములె. ఎద్దా బక్కచిక్కియున్నది. బరువా తలకుమించి యున్నది. ఎట్లో లాఁగఁజాలక లాగుచున్నది. ఇంకను గమ్యస్థానము చాల దూరమున్నది. ప్రొద్దుగ్రుంకినది.

అప్పలసామికిఁ ద్వరగా నిల్లుచేరవలెనను నాందోళన హెచ్చయ్యెను. కొరడాతో దానిని గొట్టసాగెను. పాపమా యెద్దు కొండొకదూరమునడచి మఱియడుగువేయలేక మోఁకరిల్లెను. అప్పలసామి బండిదిగి దానిని మోదసాగెను. అది కదలలేదు. తోఁక మెలిపెట్టి లాగెను. ముట్టిమీఁదఁగొట్టెను. ఎన్ని చేసినను నది కదలలేదు మెదలలేదు. బండివిప్పెను. మరల మోదెను. కాని చచ్చిన దెట్లులేచును? అది కని యప్పలసామి కుయ్యో మొఱ్ఱో యనెను.

పల్లెటూరిదారులు చంటిపిల్లల కన్నులవలె సాయంకాలముకాఁగానే మూసికొని పోవునుగదా! ఇఁక వానియవస్థ నాలించువారెవ్వరు? కనుచూపుమేరలో నొక పల్లెయైనలేదు. చీఁకటులు క్రమ్మెను. రమారమి సంగోరుసరకు బండిలోఁ గలదు. బొజ్జకొంగున నూఱురూపాయలుదాఁచి యున్నవి. బండి విడిచిపోవుటెట్లు? ఒంటరిగా మార్గమధ్యమున రాత్రి గడపుట యెట్లు? ఆలోచనా నిమగ్నుఁడయ్యెను. కొంతవడికి ధైర్యము తెచ్చుకొనెను. తెల్లవార్లు బండిమీఁదనే కూర్చుండి జాగరము చేయనెంచెను. కొంతసేపు విచారించెను. కొంతసేపూరకే కూర్చుండెను. కొంతసేపు చుట్టఁ జుట్టి యంటించి గుప్పు

చుండెను. మధ్యమధ్య బండిచుట్టు కలదిరుగుచుండెను. ఇట్లు సగమురాత్రి గడిచినది. ఎంతసేపట్లుండఁగలఁడు? బండియెక్కిన పెద్దమ్మ నెత్తెక్కినది. కనులు మూఁతలుపడెను. గుఱ్ఱుపట్టినాఁడు. ఇంకను తెల్లవాఱలేదు. కనులు నులిమికొనిలేచెను. మొల తడవికొనెను. బొడ్డుచెంగున డబ్బు కనఁబడలేదు. కంగారుపడి లేచి యిటునటు చూచెను. దులిపినబట్టనే దులిపెను. డబ్బు లేదు. దానితోపాటు కొన్ని బెల్లపుబుట్టలుకూడ మాయమయ్యెను. వెంటనె యాయభాగ్యుఁడు దుఃఖసాగరమున మునిఁగెను. నోరునత్తి బాదుకొనెను. ఇఁక జేయునదిలేక తెల్లవాఱునప్పటికి నిల్లుచేరుకొనెను. అప్పలసామిభార్య యప్పలమ్మ యీ సంగతివిని లబోలబోయని యేడువసాగెను. నారాయణరావును, "మాయదారి ముండకొడుకు శనిగొట్టుపెద్దను నమ్మించి యమ్మినాఁడు. మాకష్టార్జితమంత నాశనమైనది" యని తిట్టి దుమ్మెత్తిపోసినది.

పిమ్మటఁ గొన్నినెలలు గడచినవి. ఒకనాఁడు నారాయణరావు సొమ్మునిమ్మని యడుగుటకై యప్పలసామి యింటికి వచ్చెను. అప్పుడు అప్పలసామి అప్పలమ్మలు చేయియొకవైపున కాళ్లకుక్కలవలె దుయ్యఁబట్టుకొని నోటికివచ్చినట్లు తిట్టసాగిరి. "ఏ మొగముపెట్టుకొని బాకీ యడుగుటకు వచ్చినావయ్యా! మాకనులలో దుమ్ముకొట్టి చచ్చెద్దునిచ్చి మాకొంపఁదీసినావు. మా సర్వస్వము హరించినావు. పైఁగా బాకీయడుగవచ్చినావా? మాకేంటి పెత్తె వెంగళప్పలు తేరనుకొన్నావా? మేమును వ్యాపా

రము చేసినాము. అంత తెలివితక్కువ వారముకాము. పో!
రేపు ప్రొద్దుపొడవకుండ మొగముకడుగుకొనకుండ రా! సొమ్ము
పట్టుకొనిపోదువుగాని. అది యిష్టములేనిచో మామొద్దను విప్పు
కొనిపో. నెలకాదు రెండునెలలుదున్నకో! యింకేమిచేసెదవు"
అని తూలనాడినారు.

అదివిని నారాయణరావు వియ్యంధులు కొందఱచ్చటికిఁ
జేరినారు. అప్పలసామిని సమర్థింప సాగిరి.

తనకు నష్టమురానిచో నారాయణరావు బెదరింపులు
లెక్కచేయక యింటికిఁబోయెడివాఁడె. కాని యేనూఱు
రూపాయలెట్లువదలుకొనఁగలఁడు. మండిపడుచు నింటికేగి లాఠీ
తీసికొనివచ్చెను. అదిచూచి యప్పలమ్మ గంగానమ్మనలె నోటి
తలుపు తెఱచెను. నారాయణరావు చేయిచేసికొనఁబోయెను.
అప్పలసామి యప్పలమ్మయు నిల్లుదూరి తలుపులువేసకొనిరి.
ఈగందరగోళమువిని యూరిలోని పెద్దమనుష్యులచ్చటికివచ్చిరి.

అప్పలసామికి ధైర్యముచెప్పి బయటకు రప్పించిరి.
నలుగురుపెద్దలు చెప్పినట్లిద్దఱను నొప్పుకొనుమనిరి. వారందుల
కియ్యకొనిరి.

## 6

పంచాయతి తీర్పు అనుకూలముగాఁ జేయించుకొను
టకై యిరుపక్షములవారు తీవ్రకృషిచేయఁదొడఁగిరి, రెండు
రోజులు గడచినవి. మూఁడవనాఁటి మధ్యాహ్నము నాల్గు
గంటలవేళ గ్రామశాలయొద్ద పంచాయతి సమావేశమయ్యెను.

వారిలో నారాయణరావు స్నేహితుఁడైన వెంకయ్యచౌదరి లేచి "యాలస్యమెందులకు ముందు పంచాయతి సభ్యుల నెన్నుకొనవలయును గాన నారాయణరావూ! చెప్పు నీవు ఎవరినెన్నుకొనెదవో" యనెను.

అదివిని నారాయణరావు అప్పలస్వామినే చెప్పుమనెను. వెంటనే యతఁడు గర్జించుచు లేచి మదీనా పేరుతో నలువురను బేర్కొనెను. మదీనాపేరు వినఁగానె నారాయణరావునకు నడుము విఱిగినట్లయ్యెను, ముఖము వెలవెలఁబాఱెను. అది గ్రహించి వెంకయ్యచౌదరి 'నారాయణరావూ! నీకు సమ్మత మేనా?' యని ప్రశ్నించెను. నారాయణరావు నిరాశచెంది పైకిఁ దోఁపనీక 'యటులేకానిం'డనెను. పిమ్మట వారు మదీనాను అధ్యక్షునిగా నెన్నుకొనిరి. బాధ్యత యెక్కువైనకొలఁది మానవునకు సంకుచితబుద్ధి యంతరించును. మనుజుని కుమార్గ గామినిఁ గాకుండ చేయునది బాధ్యతయె. పడుచుఁదనములోఁ జెడుదారినిఁబడి చరించు కుమారునిఁ గాంచి వృద్ధులగు తల్లి దండ్రు లెంతయో చింతనొందుదురు. కులకళంకుఁడని కుందు దురు. కాని సంసారబాధ్యత నెత్తిపైఁ బడగానే కొలది నాళ్ళకే యా యవ్యవస్థితచిత్తుఁడగు నున్మత్తయువకుఁ డెంత ధైర్యశాలి, శాంతచిత్తుఁడు నగుచున్నాఁడు! ఇది బాధ్యత వలనఁ గలిగిన జ్ఞానఫలితమేకదా!

పంచాయతి కధ్యక్షుఁడైన మదీనా మనస్సునఁగూడ బాధ్యతాభావ ముత్పన్నమయ్యెను. అతఁడు 'నేనీ సమయమున

న్యాయపీఠ మధిష్ఠించి యున్నాను. నానోటినుండి వెలువడు వాక్యములు ధర్మదేవతావాక్యములు. ఆ దైవవాణిలో నా మనోవికారముల కెంతమాత్రము చోటీయరాదు. సత్యపథము నానంతయు దాటరాదు' అని నిశ్చయించుకొనెను.

పంచాయతీ ప్రారంభమయ్యెను. సభ్యులు సధ్యక్షుఁడు నిరుపక్షములవారి వాద ప్రతివాదములను వినిరి. అందఱుఁ దానొప్పుకొనిన సొమ్ము నప్పలస్వామి నారాయణరావునకిచ్చి తీరవలయునను నేకాభిప్రాయమునకు వచ్చిరి. కాని మరల నిద్దఱు సభ్యులు 'ఎద్దు చనిపోయినది కాన గొంతసముదాయము అప్పలనాయుకిఁ జేయుట మంచి' యనిరి. మిగిలినవారిలో మఱి యిద్దఱు 'ఎద్దు చచ్చిపోవుటకు నప్పలసామి నిర్దయయే కారణము. దానికి సరిగా మేత వేయక చావగొట్టి పనిచేయించి నాఁడు కావున నెద్దుఖరీదు నిప్పించుటయేగాక శిక్ష విధించుట న్యాయము. ఒక్కనికిట్టి శిక్ష విధింపబడెనేని మఱియెవ్వరుఁ బశువులయెడ నిట్టి నిర్దయత చూప సాహసింప'రని నొక్కి వక్కాణించిరి.

పిమ్మట సధ్యక్షుఁడగు మదీనా లేచి యిట్లు తీర్పు చెప్పెను. 'వాది ప్రతివాదులారా! సావధానులరై వినుఁడు. మేము మీ వ్యవహారము బాగుగా విచారించితిమి. అప్పలసామి యెద్దును గొనునప్పటి కది చియ్యబట్టి చక్కఁగానున్నది. కాన అతఁడు నారాయణరావునకుఁ గొన్నసొమ్మిచ్చుట యుచితము. ఆనాఁడే యప్పలసామి రొక్కమిచ్చి యెద్దును విలిచియున్న

నీనాఁడు సొమ్ము తిరిగి యిమ్మనునా ? తాను సరిగా మేఁత పెట్టక యెక్కువపని చేయించుటచే నది చచ్చినది. కాని వేఱొండు కాదు. పంచాయతీ సభ్యులలో మొదటి యిద్దఱు చెప్పిన విషయము నారాయణరావు దయపై నాధారపడి యున్నది. మిగిలిన యిద్దఱు చెప్పినది యీతగవునకు సంబంధించినది కాదు.'

ఈతీర్పు వినఁగానే ప్రేక్షకబృందము జయజయధ్వాన మొనరించెను. 'న్యాయమనిన నిదే న్యాయము. పంచాయతిలో దైవముండును. కావుననే మదీనా న్యాయమొనరించినాఁడు' అని యతనిని బొగడుచుఁ తమతమ యిండ్లకేఁగిరి.

నాలుగు గడియలు కాఁగానే మదీనా నారాయణరావు కడకు వచ్చి కౌగలించుకొని విషాదపూరిత నేత్రములతో "సోదరా ! నీవు నాపంచాయతీలోఁ దీర్పు చెప్పిననాఁటినుండి నేను నీ ప్రాణశత్రువనైతిని. కాని నేఁడు పంచాయతి కధ్యక్షుఁడైనవాఁడు తన నిర్ణయమును బ్రకటించుటలో నొకనికి శత్రువు గాని మిత్రుఁడుగాని కాఁడనియు న్యాయముతప్ప వానికి మఱొక్కటి తోఁపదనియు వానినాల్కపై భగవంతుఁడు తాండవమాడుననియుఁ దెలిసికొంటిని" అనెను.

అదివిని నారాయణరావు విలపింపసాగెను. ఈ కన్నీళ్ళతో నిద్దఱు మనములలోని మాలిన్యములు కడుగఁబడి హృదయములు పునీతములయ్యెను. వాఁడిపోయిన స్నేహలత మరలఁ బచ్చపడెను.

———

# ౪ ప్రతిజ్ఞ

## 1

అర్థరాత్రివేళఁ బంపానది యొడ్డ నొరసికొని మర్మర ధ్వనితోఁ బ్రవహించుచున్నది. నదికి దక్షిణభాగమున నొక చిన్నపర్వతముగలదు. దానిమీఁద నొక జీర్ణమైన కోటగలదు. ఆకోటయంతయుఁ బెద్దపెద్ద చెట్లచే నావరింపఁబడి యుండెను. దానికిఁ దూర్పుదిక్కున నొక పల్లెగలదు. ఈగ్రామము ఈ కోట యొక జగపతిరాజు కీర్తికిఁ జిహ్నములై యున్నవి. ఇప్పటికిఁ గొన్ని శతాబ్దములు గడచినవి.

దేశములో రాజ్యములు తలలెత్తినవి; నశించినవి. ఎందఱో మహమ్మదీయులు వచ్చినారు; పోయినారు. జగపతి రాజులుకూడ లేచినారు; పడినారు. ఇట్టి దురవస్థలను బొందని యూరుగాని, పల్లెగాని లేదు. ఈకోటపై నింతవరకు నే శత్రు రాజుయొక్క విజయపతాకయు నెగురలేదు. ఈ గ్రామములో నేవిద్రోహియొక్క పాదమును మోపఁబడలేదు.

ఆకాలములో రాయ జగపతివర్మయను వీరుఁడగు రాజ పుత్రుఁడుగలఁడు. ప్రతివీరుఁడు తన బాహు బలపరాక్రమము లను చూచికొని మురియు కాలమది.

ఒకవైపుననుండి సముద్రతరంగములవలె ముసల్మానులు పొంగి పొరలివచ్చి తమసేనలతోఁ గాలూనుచున్నారు. మఱొక వైపున బలవంతులగు రాజులు బలహీనులను బీకి నులిమి చంపు

టకు సంసిద్ధపడుచున్నారు. రాయజగపతివర్మగారియొద్ద వ్రేళ్ళ మీఁద లెక్కింపఁదగిన యాశ్వికులును పదాతులును మాత్రమే గలరు. కాని వారందఱు నుక్కుతునకలు. వీరి మూలమువనే వర్మ తన కుల గౌరవమును నిలుపుకొనుచు వచ్చుచుండెను. ఒక్క క్షణమైన నతఁడు సంతోషముతో స్తిమితముగాఁ గూర్చుండ నోచుకొనలేదు. ఎప్పటికప్పుడు ఏశత్రువు వచ్చి మీఁదఁబడునో యని యాందోళనయే.

అతఁడు రాగమ్మదేవిని పెండ్లియాడి మూఁడేండ్లు మాత్రమే యైనది. కాని ఒక్కనాఁడైన నామెతో ఉపవనంబులఁగాని, నదీకూలంబులఁగాని షికారుపోఁగ గడపలేదు. ప్రతినిత్యము పర్వతప్రాంతములనో, యరణ్యప్రదేశములనో సంచరించుచుండెను.

సిరంతరము రాగమ్మదేవి భర్తను 'నాథా మీరు వనములోనున్న నేను వనవాసమొనర్తును. మీరు కాశికేగినఁ గాశికివత్తు; మిమ్ము వీడి యొక్క క్షణమైన నుండఁజాలను. మీరున్నదే నాకు స్వర్గలోకము. కాన మీ రెచ్చటికేగిన నచ్చటికి నన్నుఁగూడ వెంటగొనిపొండు' అని సవినయముగ ప్రేమపూర్వకముగా, గంభీరముగా బ్రతిమాలెను. బామాలెను. కన్నీళ్ళు గ్రుక్కెను. కాని యామె ప్రార్థన లేవియు వానినిఁ గరిగింపలేదు. జగపతులు దృఢచిత్తులుగదా!

## 2

అది చీఁకటిరాత్రి. ప్రపంచమంతయు అదమఱచి నిద్ర పోవుచుండెను. కాని యాకసమున నక్షత్రములు మినుకమినుకు మని మెఱయుచుండెను.

రాగమ్మ నిద్రరాక యటు నిటు ప్రక్కపై దొరలు చుండెను. ఆమె యాఁడుబిడ్డ రాధికాదేవి రత్నకంబళముపైఁ గూర్చుండి "రామ నీ సమానమెవరులేరురా!" యని మధుర గానము చేయుచుండెను. అదివిని రాగమ్మ 'రాధికా! నీ పాట లతో నామనస్సును బాధింపకుమమ్మా! నీకు నిద్రపట్టుటలేదా?'

రాధి:—కాదమ్మా! నిన్ను నిద్రపుచ్చుటకు జోలలు పాడు చున్నాను.

రాగ:—నిద్ర నాదరికైనా వచ్చుటలేదమ్మా.

రాధి:—ఎవరినైన వెదకుటకు వెడలెనేమో!

అని వారిరువురు సంభాషించుకొనుచుండఁగాఁ దటా లునఁ దలుపులు తెఱువఁబడెను. దృఢకాయుఁడు రూపమన్మ థుఁడు నైన యొకపురుషుఁడు లోన బ్రవేశించెను. అతఁడే రాయజగపతివర్మ. అతఁడు సిక్తవస్త్రుఁడు నాయుధ విహీనుఁడు నై యుండెను. అతనిఁ గాంచి రాగమ్మ ప్రక్కదిగి నిలువబడెను. వానినిఁగాంచి,

రాధి:—అన్నా బట్టలు తడసియున్న వేమి?

వర్మ:—నది నీఁది వచ్చితిని.

రాధి:—ఆయుధములేవి ?

వర్మ:—లాగికోఁబడెను.

రాధి:—నీబలఁగ మేమైనది ?

వర్మ:—అంతా వీరశయనము గాంచిరి.

ఆ సంభాషణము విని రాగమ్మ 'భగవంతుఁడు మేలు చేసెను' అనెను. ఆమాటకు రాధిక మొగము జేవురించికొని సగర్వముగా "అన్నా! నీవు కులగౌరవము గంగపాలుచేసితివి. ఇట్లెన్నఁడు జరిగియుండలేదే' అన్నది. తానన్న పడిచచ్చుట తనచెల్లెలి పోటుమాటలు వినఁగానే యనురాగాచ్ఛాదితమైన యాతని శౌర్యాగ్ని యొక్కసారిగా భగ్గుమని మండెను.

చెల్లెలిని గాంచి 'రాధికా! నీమాటలు నాకు మేలు కొలుపులైనవి. ఇఁక క్షణకాలముగూడ నిచ్చటనుండను. ఇదిగో పోవుచున్నా'నని యా కటికచీఁకటిలో కోటదాఁటి నది నీది యావలకుఁబోయి యదృశ్యుఁడయ్యెను.

రాగమ్మకూడ కోట దాఁటునఱకు వానిని వెంబడించి వెడలినదిచెంతనున్న యొక రాతిబండపై నిరాశాభావమై చింతించుచుండెను. ఇంతలో రాధికకూడ నచ్చటికి వచ్చెను. ఆ యిరువురకు నిట్లు సంభాషణము జరిగెను.

రాగమ్మ:—(ఆఁడుట్రాఁచువలె బుసకొట్టుచు) రాధికా కుల గౌరవము ఇంత ప్రియమైనదేమి !

రాధిక:—ఔను.

రాగమ్మ:—నీకే మగడున్నచో గుండెలోఁబెట్టుకొని దాచు కొందువు.

రాధి: —అట్లైనట్టికిఁ జేయను. గుండెలోఁ బొడిచెదను.

రాగ:—(గర్వముతో) ఆఁ చూతునులే! ఉయ్యాలలోఁ బెట్టి యూఁచేగించనినాఁడు. ఈమాటలు మఱచిపోకు ముడి వేసికో.

రాధి:—ఆరోజు వచ్చిననాఁడు నీవే చూతువుగానిలే!

ఈసంభాషణ జరిగిన మూఁడునెలలకు రాయజగపతి వర్మ శత్రువుల జయించి వచ్చెను. ఆతఁడు వచ్చిన యొక సంవత్సరమునకు రాధికను వీరవర్మకిచ్చి పెండ్లిచేసెను.

రాధికా రాగమ్మల మాటలుమాత్రము ఒండొరులను మండించుచునేయున్నవి.

### 3

వీరవర్మ చాల ప్రతిభాశాలి. క్షత్రియజాతి యెల్ల నాతఁడనినఁ బ్రాణములర్పించుటకు సంసిద్ధమై యుండెను. అతఁడు సింహాసన మెక్కినది మొదలుకొని మొగలులకు పన్నుకట్టుట మానివేసెను. బాహుబలముచే రాజ్యమును విస్తరిల్లఁ జేయఁ జొచ్చెను. ముసల్మాను సేనలు పలుమాఱు లీతనిపైకి దండెత్తి వచ్చుట, యోడిపోయి పాఱిపోవుట పరిపాటియైపోయినది. ఈ వైభవముతోఁ దులఁదూఁగు నప్పుడే వీరవర్మకు రాధికాదేవికి వివాహము జరిగినది. రాధికకుఁ జిరకాలముగాఁ దనమనస్సులో నున్న కోర్కెకుఁ దగినట్లుగా కులదీపకుఁడు సూర్యవంశ క్షత్రియుఁడు భర్తగా లభించెను.

వీరవర్మ తన యైదుగురి భార్యలలోను రాధికయే తన్నుః హృదయపూర్వకముగాఁ బ్రేమించుచున్నదని తెలిసికొనెను.

ఇంతలోఁ గాలము మాఱెను. వీరవర్మ మొగలాయి లకు ఆశ్రితుఁడు కావలసివచ్చెను. హైదరాబాదు చేరెను. హైదరాబాదు యువరాజు ఈవఱకే వీరవర్మ పౌరుషప్రతాపాదులు వినియుండుటచే ఆతని రావించి యాదరశీతలకటాక్ష వీక్షణంబుల నీక్షించి తొమ్మిదిలక్షల రూపాయలు రాబడి వచ్చు జాగీరొకటి యొసంగెను.

వీరవర్మ జీవితములో నిదియొక క్రొత్త ఘట్టము. ఇంతటి విశ్రాంతిగాని, భోగముగాని యాతఁ డింతకు మున్నెన్నఁడు ననుభవించి యుండలేదు. రాత్రియుఁ బవలు కులాసా కబురులతోఁ గాలము వెళ్ళుచున్నది. రాజు విలాసములలో మునిఁగిపోయెను. రాణులు నగలు నాణెములతో వినోదించుచున్నారు. కాని రాధికమాత్రము ఏమీ సంతోషముగా లేదు. విచారగ్రస్తయై యున్నది. ఆమెనుజూచి వీరవర్మ యిట్లనెను.

వీ:—రాధికా! నీ వెందులకు ఆలాగున విచారముగా నున్నావు. నీ మొగమున నెప్పుడు ఆనందరేఖ కానవచ్చుటలేదే! నా మీఁదఁగోపమా; నేనేమైనఁ దప్పును చేసితినా?

రా:—(కన్నుల నీళ్లు గ్రుక్కుకొనుచు) నాథా! మీరెచ్చట సంతోషముగా నున్నను నేనచ్చట సంతోషముగా నుందును. ఎందులకు మీరీప్రశ్న వేయుచున్నారు? మీ ఆనందమే నా యానందము. మీ విషాదమే నా విషాదము.

వీ:—రాధికా! నేనిచ్చటికి వచ్చినది మొదలు నీ ముఖ పద్మముపై రమణీయ మందహాస రుచులు కానవచ్చుట లేదు. నీ వొకనాఁడును నాకుఁ దాంబూలమీయలేదు. దుస్తులు సవరింపలేదు. తలపాగా నందీయలేదు. పన్నీరు చిలుకలేదు. తిలకంబు దిద్దలేదు. నీ ప్రేమలత వాఁడివత్తలు గాలేదుగదా?

రా:—నాథా! మీరు చాల విషమ ప్రశ్నలు వేయు చున్నారు? యదార్థము వచించినచో నాకు సంతోష మంతగా లేనిమాట వాస్తవమే. సంతోషముగా నుంద మని యెంత ప్రయత్నించినను అదేమోకాని నా గుండెలపై నేదో బరువుపెట్టినట్టుగా నున్నది.

వీరవర్మ ఆనందరసమగ్నుఁడై యుండెను. ఆమెమాట లోని యంతరార్థమును గ్రహింపలేక పోయెను. ముఖము చిట్లించుకొని యిట్లనెను,

'ప్రేయసీ! యిక్కడలేని సుఖములు మనరాజ్యములో నేవియున్నవి?'

అదివిని రాధిక క్రోధఘూర్ణితముఖ మండలయై యిట్లనియెను. 'నేనొకమాట చెప్పెదను. మీరు కోపగింపరు గదా?'

వీ:—చెప్పు. ఏమియుఁ గోపగింపను.

రా:—మన రాజ్యములో నేను రాణిని. ఇక్కడ నేనొక జాగీరుదారునకు దాసిని. అయోధ్యలో కౌసలవ్యలెనే

మన రాజ్యములో మహారాజ్ఞని. ఇక్కడ పాదుషా గారి సేవకురాలిని పడఁతిని. ఏ పాదుషా పాదములకు మీ రీనాఁడు వంగి వంగి సలాములు చేయుచున్నారో యా పాదుషా చిన్న తనమున్నటి దాఁక మీ పేరు విన్న గడగడ లాడుచుండెడివాఁడు. రాణినైన నేను దాసినై మనస్సు నెట్లు ప్రసన్నముగా నుంచుకొనఁ గలను. అది నా చేతఁగాదు. పాపము మీరు ఈ పదవి, విలాసములు చాలశ్రమపడి సముపార్జించినారు.

ఆమాటలు వినఁగా వీరవర్మ కన్నులు తెరతీసినట్లయినవి. ఇంతవఱకు నాతఁడు రాధిక భావౌన్నత్యమును గ్రహింపలేక పోయెను. తల్లిదండ్రులు లేని పిల్లవాఁడు తన తల్లిదండ్రుల మాట తలఁపునఁ బొడమినప్పుడు విచారించునట్లుగా వీరవర్మ రాధిక మాటలు విని తన రాజ్యవైభవము జ్ఞప్తికివచ్చి కన్నుల నీరు పెట్టుకొనెను — ఉదారభావుఁడై, యనురక్త హృదయుఁడై రాధికను కౌఁగిలించుకొనెను. నాఁటినుండి వాని మనస్సంతయుఁ దన రాజ్యముమీఁదనే యుండెను.

## 4

కోలుపోయిన బిడ్డను మరలఁ బడసిన తల్లివలె వీరవర్మ తనరాజ్యమును దిరుగఁ బడయుటకుఁ బ్రజా సమూహము ఆనందము నొందెను. దాని యదృష్టము పండినది. దేవిడీ ముందు తౌర్యత్రికము మ్రోఁగెను. రాధికా నేత్రములు

జాతీయతాభిమాన పూరితములై తళతళ మెఱసిపోయెను. ఇట్లు కొన్ని నెలలు గడచెను. ఇంతలో పాదుషా రోగగ్రస్తుఁడయ్యెను. పాదుషా పుత్త్రిలలో నీవఱకే యీర్ష్యాగ్ని రగులు కొనుచుండెను. తండ్రిజబ్బుగా నున్నాఁడను వార్త యాయగ్నిని ప్రజ్వలింప జేసెను. కుమారులు తమతమ బలములతో రాజధానికి బయలుదేఱి వెళ్ళిరి. అది వర్షకాలము. నదులన్నియుఁ బొంగి పొరలుచున్నవి. పర్వతములు వనములు పచ్చని పచ్చికతో కనువిందొనరించుచుండెను. పంటభూములు సస్యశ్యామలములై విరాజిల్లుచున్నవి. పాదుషా కుమారులిరువురు ఉత్సాహపూరితులై చకచక ముందునకు సాగిపోవుచుండిరి. కతిపయ ప్రయాణములకు గోదావరీతీరమును జేరిరి. పాదుషా సేనలు వీరి శుభాగమనమును గాంక్షించుచు నావలియొడ్డునకు వచ్చెను. లోభముకన్న విశాలమైన యానది తరంగములతో తుఱంగలించుచుండెను. ఆనదిని జూచి పాదుషా తనయులు దాని దాఁటు నుపాయము లేక కలఁత నొంది, వెంటనే వీరవర్మ యొద్దకు "త న్మిమ్మాయాపదనుండి యుద్ధరింపు"మని వార్త నంపిరి.

ఆ వార్త చేరఁగానే వీరవర్మ రాధికను గాంచి "దీనికి నేమి ప్రత్యుత్తర మంపుదము?" అనెను.

రా:—తప్పక మీరు వారికి సాయపడనలసినదే.

వీ:—మనము సాహాయ్యము చేసినచో పాదుషా పుత్రులలో కలఁతలు పెచ్చగుటయేగాక మనకుఁ గూడ నపాయము సంభవిల్లును.

రా:—అది నిజమే కాని శరణన్నవానిని గాపాడుట క్షత్రియ ధర్మమ్ము గాదా!

వీ:—ప్రేయసీ! నీవు ఆలోచించి జవాబు చెప్పినట్లు లేదు.

రా:—ప్రాణనాథా! యీమార్గము కర్కశమని రాజపుత్త్రిం రక్తము ధారవోయవలసియుండుననియు నే నెఱుంగక పోలేదు. మనరక్తమును ధారవోయుదము. ఆరక్తముచే గౌతమీజలమును నెఱ్ఱబాఱఁజేయుదము. గౌతమీనది ప్రవహించుచున్నన్నాళ్ళు మనకీర్తి గానము చేయుచుండును. మన వంశములో నేయొక్కఁడు గాని యున్నను వాని మోమున నీ రక్తబిందువు తిలకమై శోభిల్లునుఁగాక.

ఆకాశమంతయు మేఘపంక్తులచే నావరింపఁబడియుండెను. రాజపుత్త్రిదళము గోదావరీ తీరమును సమీపించెను. ప్రతి వీరుఁడు వీరరసమును గ్రక్కుచుండెను.

రాధిక తన ముద్దుబిడ్డల నిద్దఱ నాలింగనము చేసికొని పతికి తాంబూలమొసంగి 'రాజపుత్త్రిల గౌరవము నిలుపుఁడి', యనెను.

నేఁడు రాధిక హృదయముప్పొంగిపోవుచున్నది. సర్వాంగములు సప్రాణములై కులికిపోవుచున్నవి. రాజపుత్త్రసేనను గాంచి పాదుషాకొడుకు లానందపరవశులైరి. ఆ ప్రాంతభూములన్నియు వీరవర్మకుఁ జిరపరిచితములైనవి. వీరవర్మ తనసేన

సంతను నొకచోటదాచి పాదుషా సూనుల సేనతో దూర్పుగా నడువసాగెను.

ఆవలియొడ్డుననున్న పాదుషా పెద్దకుమారుఁడు వీరి పోకను గాంచి నదినెచ్చటనో ముందుభాగమున దాఁటఁగలరని యూహించి తన సేనను రేవునుండి తొలఁగించెను. డాఁగియున్న రాజపుత్రసైనికులు తమ వాంఛితము నెఱవేఱెనని తలంచి వెలుపలకు వచ్చి గుఱ్ఱములను నదిలోనికి దుమికించిరి. వీరవర్మ పాదుషా పెద్దకుమారు నాకీతిగా మోసపుచ్చి తాను వెంటనే ససైన్యుఁడై వెనుకకుఁ దిరిగివచ్చి తన సేనతోపాటు నదిని దాఁటెను. ఈ రాకపోకలలో రెండుజాముల ప్రొద్దుగతించెను. ఇంతలో నేడుగురు రాజపుత్రుల శవములు కొట్టుకొనుచుండెను.

రాజు రాకనుగాంచి రాజపుత్ర సేన ద్విగుణీకృతోత్సాహమును గాంచెను. సహాయార్థులైన పాదుషా సైనికులుకూడ 'అల్లాహో అక్బర్' అని యఱచుచు శత్రుసేనలతోఁ దలపడిరి. పరపక్ష సైనికులు కళవళమొంది చెల్లాచెదరైరి. ఇరువాగుల వారికి బాహాబాహియుద్ధము జరుగుచుండెను. ఇంతలో సాయంకాల మయ్యెను. రణరంగమంతయు రక్తసిక్తమై యొఱ్ఱవాఱెను. ఆకాశము అంధకారబంధుర మయ్యెను. పోరు ఘోరమయ్యెను. శత్రుసేన రాజపుత్రసేనను అణఁగఁ ద్రొక్కుచుండెను. ఇంతలో ఆకస్మికముగాఁ దూర్పుదిక్కుననుండి ఒకొక యాశ్వికదళము హుటాహుటినివచ్చి వైరివీరులపైఁబడెను. శత్రుసేనలు కళ్లు తేలవైచెను. చేఁజిక్కిన విజయము క్షణములో జాఱిపోయెను.

ఈ దైవిక సాహాయ్యమును గాంచి యుభయపక్షములు ఆశ్చర్య చకితములయ్యెను. సరళస్వభావులగు యోధులు అదృష్ట దేవత జయము చేకూర్ప సరుదెంచెనని తలంచిరి. వీరవర్మ దగ్గఱకు రాఁగానే పురుషవేషధారిణియైయున్న రాధిక తటాలున డిగ్గి పతిపాదములకు మ్రొక్కెను. వీరవర్మ యామె రాధికయని గుర్తించి నిర్వ్యాజానంద మొందెను.

ఆ త్రుటి యుద్ధభూమి యంతయు దుఃఖపూరితమై యుం డెను. క్షణకాలముక్రిందట వీరభటులతోఁ గలకలలాడుచున్న యాప్రదేశము ఇప్పుడు పీనుఁగుపెంటయై కళావిహీనమై రుద్ర భూమియై భయముగొల్పుచుండెను. మానవుఁడు స్వార్థపరుఁడై యనాదికాలమునుండియుఁ దనసోదరుల హత్య కావించుచునే యున్నాఁడు. జయముగాంచిన సేన యావేశముతో నోడలెట్టుఁ గక చచ్చిన సైనికులనుగూడ మోదసాగెను. తొల్లి వీరత్వ శూరత్వముల కాదర్శమైన సేన యిప్పుడు నీచత్వ దుర్బలత్వ ముల కాకరమై గ్లానిచెందెను.

ఆ పోలికలనిలో నొక్క వైపున పాదుషా పెద్ద కుమారుని సేనానాయకుని కోసయూపిరితోఁ బడియుం డెను. దానిగుఱ్ఱము అతనిచెంత నిలుపఁబడియుండెను. తోకతో దోమలను ద్రోలుచుండెను. వీరవర్మకు గుఱ్ఱములన్న చాలసరదా-దానినిజూచి మోహపరవశుఁడయ్యెను. అది కత్తి వాని (తోఁక గిట్టలు తెలుపైన నల్లని గుఱ్ఱము) దానిప్రత్యేవ యవయవము మలిచి చెక్కినట్లుండెను. దాని సింహపుజూలు, చిఱుతపులి నడుము, స్వామిభక్తిగాంచి యాశ్చర్యచకితులైరి.

వీరవర్మ[illegible]టులనుగాంచి 'ఆయుధప్రయోగము చేయకుండ దానిఁ బట్టి తెచ్చినవానికిఁ గనకాభిషేకము గావింతు'ననెను. అదివిని భటసమూహము నలువైపులనుండి యచ్చటకు మూఁగెను. కాని యొక్కఁడును దానిని సమీపింప సాహసింపలేదు. కొందఱు దానిని చూత్కార పూర్వకముగాఁ బిలువసాగిరి. కొందఱు ఉరులొగ్గఁదలచిరి. కాని యేయుపాయము సఫలత గాంచలేదు. అదికాంచి రాధిక నిర్భయురాలై గుఱ్ఱముచెంతకుఁ జనెను. ఆమె కనులలోఁ బ్రేమప్రకాశముగాని మోసముచూప ట్టుటలేదు. ఆమెనుగాంచి యశ్వము సకిలించి తోఁకయూడించి తలవంచెను. వెంటనే రాధిక యా తత్తడిమెడపై చేయివైచి తట్టి వీఁపు నిమిరెను. తురగము ఆమెపైఁట చెఱఁగునఁదన తలదూర్చెను. రాధిక దానికళ్ళెము పట్టుకొని తమగుడారము వైపునకుఁ దోకొనిపోయెను. హయము సేవకునివలె నామె వెంట జనెను. కాని యా యాజానేయము రాధికయెడఁ గూడ నిష్ఠురత చూపియుండి. లెస్సగా[illegible] శ్వమే వీరిపాలిటి మాయాకనకమృగము.

5

ప్రపంచమే యొక మహారణరంగము. ఈ రంగములో సమయోచిత ప్రజ్ఞాప్రతిభలు గలవాఁడె విజయము గాంచుచుండును. వాఁడు అదనెఱిఁగి యెంత యుత్సాహముతో ముందునకుఁజనునో యంతయుత్సాహముతోడనే వెనుకంజకూడ

వేయుచుండును. వాఁడే రాష్ట్రనిర్మాత కాఁగలఁడు. వాని చరిత్ర స్వర్ణాక్షరములతో వ్రాయఁబడును.

ఈరంగములో నొక్కఁడు ఎన్నియిక్కట్లు వచ్చినను ముందుకుఁ జొచ్చుకొనిపోవుటయే కాని వెనుకడుగు వేయఁడు. అట్టిధీరుఁడు తన జయమును రణనీతికర్పణము చేయును. తన సైన్యము సర్వస్వము నాశనమైనను వేసినయడుగు తీయఁడు. ఇట్టివారిలో విజయము నొందువారొకరిద్దఱు మాత్రమె కాని వారి యపజయముకూడ విజయముకన్న మిన్నగాఁ గీర్తింపఁ బడును.

అనుభవజ్ఞుఁడగు చమూపతి రాష్ట్రనిర్మాణమునకై వేసిన పునాది యెన్నటికిఁని జలింపదు. వానియొద్దనున్న యోధులు పట్టిన ప్రతిజ్ఞకై ప్రాణము లర్పింతెదరు. ముఖములు చిట్లింపరు. రాష్ట్రమును బెంపొందింతురు. దాని గౌరవ ప్రతి [illegible] మానధనము నంకి[illegible]ర్తురు. కాని [illegible]రమునకే నిట్టి సాహసిక యోధులకు జన్మము చేకూఱక పోయినను [illegible]లలో వారి పేరు మాఱుమ్రోఁగక మానదు. రాధిక యీ[illegible]ష్యములోఁ జేరెదు సాహసికురాలు.

నదిని దాఁటి పాదుషాపుత్రులు శత్రువులనోడించి చను సంతలో సం[illegible]ష్ట దేవత వారి శిరములపై నృత్యముచేయు చుండెను. విజయశ్రీ వారికొఱకు సింహాసనము నలంకరించి సిద్ధముగా నుంచెను.

పాదుషా గుణవంతుఁడు కావున తన పెద్దకుమారుఁడు సేనానాయకులు రాజ్యలోభముచేఁ దన తనయులయెడఁ జేసిన యపచారమును మన్నించి వారివారిపదవులను వారికొసంగి వీరవర్మను రావించి యాతఁడు సేసిన యుపకృతికి ఫలితముగా చాగలునాటి సీమయంతయు జహాగీరుగా నొసంగి సమ్మానించెను. తిరిగి వీరవర్మ రాజసేవకుఁ డయ్యెను. భోగలాలసుఁడ య్యెను. రాధిక తనపరాధీనతకు మరల లోలోనఁ గుమిలిపోవుచుండెను.

గుఱ్ఱమును గోలుపోయిన సేనాధ్యక్షుఁడు మంచి మాటకారి. కావుననే యతఁడు తన మృదుమధుర వాక్యములచే పాదుషా యనురాగమునకుఁ బాత్రుఁడు కాఁగలిగెను. కాని వానికిఁ దన గుఱ్ఱమును బోఁగొట్టుకొనిన బెంగమాత్రము పోలేదు.

ఒకనాఁడు వీరవర్మపుత్రుఁ డాయశ్వమునెక్కి యాచమూపతి భవనము వైపుననుండి వెడలుచుండెను. అయదను కనిపెట్టి దానిని పట్టుకొనవలసినదిగాఁ దన నౌకరులకు సైఁగచేసెను. వెంటనే వారు దానినిపట్టుకొనిరి. రాజకుమారుఁడు చేయునది లేక బిక్కమొగముతో కాలినడకను దల్లిచెంతకేఁగి జరిగిన యుదంతమంతయుఁ జెప్పెను. అదివిని యామె మండిపడి 'నాయనా! నేను నీచేతిలోనుండి గుఱ్ఱము పోయినందులకు విచారించుటలేదు. కాని నీవు ప్రాణములతో [illegible] వచ్చినందులకుఁ జంతిల్లుచున్నాను. నీశరీరమున రాచరక్తములేదా!

గుఱ్ఱముబోయినఁ బోవుగాక. కాని నీవు 'రాజపుత్రుని చేతినుండి వాజినిలాగుకొనుట నవ్వులాట కాదని' రుజువుచేయ వలసినది. అని యదలించి కత్తిఝళిపించి, పదిమంది యోధులను వెంటఁగొని, సేనానాయకుని మందిరప్రాంగణమున కేఁగెను. ఇంతలో సేనాపతి ఖాన్‌సాహేబు ఆ ఘోటకమునెక్కి దర్బారున కేగియుండెను.

రాధిక వెంటనే వేగవతియగు నదివలె పాదుషా దర్బారునకుఁ జని యెదుటనిలువఁబడెను. ఆమెను జూడఁగానే సభాభవనమంతయుఁ గలకలమొందెను. అధికారివర్గమంతయు సభనలంకరించెను. పాదుషాకూడ నరుదెంచెను. రాధికాభటులు ఖడ్గములు ఝళిపించుచుండిరి. నలువయిపులనుండి గోల బయలు దేఱెను. అనఁగాంచి రాధిక యుచ్చైస్స్వరముతో నిట్లనియెను:

"ఖానుసాహేబూ! ఆ నాఁడు గౌతమీ తీరమునఁజూప వలసిన నీ పౌరుష ప్రతాపములు నేఁడు ముక్కు పచ్చలారని కుఱ్ఱవానియొద్ద చూపుట లజ్జాకరము గాదా! వానియొద్దనుండి గుఱ్ఱమును లాగికొనుట నీకుఁ దగినపనియేనా?"

ఖా:—(కన్నులనిప్పులుగ్రక్కుచు గంభీరస్వరముతో) పెఱవానికి నా హయము నుపయోగించుకొను హక్కెట్లుగలదు?

రా:—అది నీదికాదు నాది. నేను దానిని రణరంగములో జయించి గైకొంటిని. దానిపై నాకు హక్కు సంపూర్ణముగాఁ గలదు. క్షాత్రపు రణనీతిన్యాయము నీ వెఱుఁగవా?

ఖా:—కావలసినచో నామందడిలోఁగల గుఱ్ఱములనెల్ల నిచ్చె
దను గాని యీ గుఱ్ఱము నియ్యఁజాలను.

రా:—నేను నా తురంగమును దీసికొని తీరెదను.

ఖా:—నీకు గుఱ్ఱానికి సరిపోవు నగలు నాణెములు ఈయఁగలను
కాని గుఱ్ఱమును మాత్రము విడువను.

రా:—అయితే యీ తగవు నా తరవారియే తీర్చఁ
గలదు. రాజపుత్త్రయోధులు కత్తులు పైకిఁ దూయు
చుండిరి. క్షణములో దర్బారంతయు రక్తసిక్తము
కావుటకు సిద్ధముగా నున్నది. ఇంతలో పాదుషా
తటాలున వారి మధ్యకు వచ్చి యామెతో నిట్లనెను:

'రాధికారాణీ! నీ సైనికుల నాఁపు. గుఱ్ఱము నీకు
లభింపఁగలదు. కాని వానికి మూల్యము చాల ఈయ
వలయును.

రా:—నా సర్వస్వము దానికొఱకిచ్చుటకు సిద్ధముగా నున్నాను.

పా:—జాగీరంతా యిచ్చెదవా?

రా:—నా దృష్టిలో జాగీరు గడ్డిపరకకు విలువలేనిది.

పా:—నీ రాజ్యమును కూడ నిచ్చెదవా?

రా:—ఔను రాజ్యమునుకూడ.

పా:—ఒక గుఱ్ఱము కొఱకే.

రా:—కాదు. ఈ ప్రపంచములో నమూల్య వస్తువేదియో
దాని కొఱకు.

పా:—అదేమిటి ?

రా:— (నా) ప్రతిజ్ఞ.

రాధిక యీ విధముగాఁ దన జాగీరు, రాజ్యము, రాజ సన్మానము గోలుపోవుటగాక భావి జీవిత మార్గమంతయు కంటకమయము గావించుకొనెను. ఈ గడియ మొదలుకొని వీరవర్మకు అవసాన కాలమునఅకు శాంతి లభింపలేదు.

6

వీరవర్మ తిరుగఁ దన కోటకుఁ జేరెను. తన జాగీరులు మున్నగునవి చేసేతల పోయినందులకు కొందలమందు చుండెను. కాని దాని ప్రసక్తి మాత్రము బైటకు రానీయ లేదు. రాధికా స్వభావము నాతఁడు పూర్తిగా నెఱిఁగిన వాఁడు. కావున నే తానీ విషయము తలపెట్టిన నామె హృదయ మునకు గొడ్డలిపెట్టగునని తలంచెను. కొన్ని రోజులు శాంతి యుతముగాఁ గడచెను. పాదుషా మాత్రము రాధిక యాడిన మాటలు మఱువలేదు. అతఁడు క్షమించుట యనునది యెఱుఁ గనే యెఱుఁగడు. స్వస్థచిత్తుఁడైనపిమ్మట వీరవర్మ గర్వమును జూర్ణ మొనర్పుఁడని పటుతర సైనికులను సర్దారులను బురి కొల్పి పంపెను. వీరవర్మ బాల్యమిత్రుఁడును, సహాధ్యాయియునైన రామవర్మ యీవరకే పాదుషా కొలువున నుండెను. అతఁడు పాదుషా యెదుట తాను వీరవర్మను ఓడింతునని ప్రతిజ్ఞ చేసెను. ఎందఱో రాజపుత్రవీరులు వీరవర్మయెడ విముఖత్వము గలిగి పాదుషా పక్షమునఁ జేరిరి. భయంకర సంగ్రామము జరి

గెను. ఉభయ బలముల ఖడ్గములు రక్తసిక్తము లయ్యెను. ఎట్లో తుదకు వీరవర్మకు జయము కలిగెను. కాని వానిశక్తి శాశ్వతముగా తఱిగిపోయెను. వీనికిఁ గుడిభుజముగానున్న నొక రాజపుత్రవీరుఁడు కూడఁ బాదుషాకు బానిస యయ్యెను. వీరవర్మ సహచరులు కొందఱు అతనికై ప్రాణము లర్పించిరి. కొందఱు మోసముచేసిరి. తాను నమ్మిన యాత్మబంధువులు గూడ తెరచాటు వేసిరి. కాని వాని సాహస మెట్టిదశలోఁ గూడఁ గుంటువడలేదు. చేయునదిలేక తుదకుఁ గోటను వదలి దండకారణ్యములకుఁ జనెను. పాదుషా సేన వానిని వెన్నంటి తఱుముఁ జొచ్చెను. ఆ యడవులలోఁ గూడ నాతనికి వైరులతోఁ బోరు తప్పదయ్యెను. రాధిక వానికెప్పటికప్పుడు సాహసోత్సాహములు పురికొల్పుచుండెను. మహాపదలు సంభవించునప్పుడును, ధైర్యము చెడినప్పుడును నిరాశాభావ మంకురించినప్పుడును, ఆమె యధైర్యము చెందక యాత్మరక్షా ధర్మమును నిలుపుకొనుచుండెను. మూడేండ్లపాటు పాదుషా సైనికులు వీరవర్మను వెన్నంటి పోరియు జయింపలేక తమ యేలిక యొద్దకేఁగి 'సాహెబ్ మీరు తక్క నావీరసింహమును వేటాడు వారు లేరు. ప్రాణములు విసిగిపోయినవి. ఆతని జయించుట మావల్లఁగాదు' అని విన్నవించుకొనిరి. అది విని పాదుషా యా దండు నచ్చోటునుండి తొలఁగిపోవ నాజ్ఞ యిచ్చెను. వీరవర్మ తన బాధ తొలఁగెనని సంతసించి కోటను జేరెను. కానియాతని తలంపు కేవలము భ్రమ.

మూఁడు వారములనుండి పాదుషా సేన వీరవర్మకోటను ముట్టడించియున్నది. కఠోర వాక్యములు హృదయమును వోలె ఫిరంగిగుండ్లు కోటను బ్రద్దలుగొట్టివేసెను. కోటలోనున్న దాస దాసీజనులు, భటులు మున్నగు వారందఱు ముట్టడింపఁబడిరి. అందు సాఁ బాలు స్త్రీలు, నాగ్గువవంతుపిల్లలు గలరు. చావుల సంఖ్య నానాటికిఁ బెరిఁగిపోవుచున్నది. రాతా యాత జనముల రాకపోకల మార్గము లరికట్టఁబడెను. గాలికూడ లోపలికిఁ జనుటలేదు. భోజనసామగ్రి తఱిగిపోయినది. స్త్రీలు, పురుషులు బిడ్డలను గాపాడుటకై యొంటిపూఁటభోజనము చేయుచుండిరి. ప్రజలు హాతాశులైరి. వృద్ధులు బాలుర లగ్గల కేగఁబాఁడు శత్రువులపై లగ్గదింపుచేయుచుండిరి. వీరవర్మ జ్వరపీడితుఁడై మంచమెక్కెను. రాజును జూచి ధైర్యముతో నుండెడు జను లందఱు నిరుత్సాహులును నిస్తేజులునై వెలవెలఁ బోవుచుండిరి. అది కని వీరవర్మ రాధికతో "నేఁడు శత్రువులు కోటలోఁ బ్రవేశించి కొల్లఁగొట్టనై యుండిరి".

రాః—నాథా! యీకన్నులతో నట్టి దుస్థితి చూడకుండునట్లు భగవంతుఁ డనుగ్రహించుఁగాక.

వీః—ఆఁబోతుల పోరాటములో లేఁగలునలిగినట్లు స్త్రీలు బాలురు నలిఁగిపోయి యనాథులగుదు రేమో యని చింతిల్లుచున్నాను.

రాః—ఇక్కడ నుండి మనము తప్పించుకొనుటెట్లు?

వీః— ఈ యనాథుల విడిచియేనా!

రా:—ఈసమయములో వారిని విడిచిపుచ్చుటయే క్షేమము మనము లేనిచో వారిని శత్రువులు కరుణింపఁగలరు.

వీ:—ఏ వీరపురుషులు నాకై ప్రాణములర్పించిరో వారిస్త్రీలను బిడ్డలను నేను విడువఁజాలను.

రా:—మనమిచ్చటనుండి యేమి ప్రయోజనము? వారినెట్లు రక్షింపఁగలము.

వీ:— వారిని రక్షింపలేకపోయినను వారితోపాటు ప్రాణముల నర్పింపఁగలముగదా! వారికొఱకై యెట్టిత్యాగమునైన చేయుదును. పాదుషా సేనలను ఒట్టునై పొగడుదును. జైలునందుంచిన నందుందును. కాని యీ సందిగ్ధస్థితిలో వారిని విడిచిపుచ్చఁజాలను.

అదివిని రాధిక లజ్జావనతవదనయై యాలోచనా నిమగ్నయై యిట్లనియెను:

"సత్యము. నాథా! మన ప్రియానుచరుల నీవిధముగా నష్టపెట్టుముంచి మన ప్రాణముల రక్షింపఁజూచుకొనుట నీచాతినీచకృత్యము. నేనింత స్వార్థాంధనైతినేల? కాని ప్రాణనాథా! వారికి ఏమీ బాధకలుగదని మీకు విశ్వాసము కలిగినచో మన పోక కేమీ యభ్యంతరముండదుగదా?

వీ:— మనకా నమ్మకము కలిగించువారెవ్వరు?

రా:—పాదుషా సేనానాయకుని హుకుము.

వీ:— ఓఁ అట్లయిన సానందులమై పోవుదము.

అదివిని రాధిక విచారసాగర నిమగ్నయై యిట్లను కొనెను "సేనానాయకుని వద్దనుండి యీ హుకుము పడియు టెట్లు? ఈ సందేశమును గొనిపోవు వాస్తవిక్రములు, ధీరులు, నేర్పరులెవ్వరు? నిర్దయులగు శత్రువులు మా సందేశమా లింతురా? ఈ కార్యము నెఱవేర్చుటకు మా పెద్దవాఁడే యర్హుఁడు" అని తలపోసి పెద్దకుమారునిఁ బిలిపించెను. ఆమె కొడుకులలోఁ నాతఁడే బుద్ధిమంతుఁడు. రాధిక వానినే మిక్కిలి ప్రేమించుచుండును. కొడుకును గాంచఁగానే యామె కన్నుల నీరుదిరిగెను, నిట్టూర్పులు వెడలసాగెను. అది కని కుమారుఁడు తల్లితో 'అమ్మా నన్నుఁబిలిపించిన కారణమేమి?'

రా:—నాయనా! నేఁడు సంగ్రామరంగమెట్లున్నది?

కు:— చెప్పుటకేమున్నదమ్మా! మన సైనికులు చాలమంది ప్రమందిరి. ఇఁక మిగిలినవారు కొలఁదిమందే.

అదివిని రాధిక కుమారునితోఁ దన యభిప్రాయము సంక్షేపముగాఁ దెలిపి "నాయనా! యీపని కెవరిని నియమింప మందువు? నీవు ఈ కార్యము నెఱవేర్పఁగలవా?"

కు: —ఆ! నాకుఁ బరిపూర్ణ విశ్వాసమున్నది.

రా:—బలే! నాయనా! వెళ్ళిరా! భగవంతుఁడు నీమనోరథ మీడేర్చునుగాక. ఓభగవానుడా! ఈ రాజపుత్ర వీరకుమారుని రక్షించి, జాతిగౌరవము గాపాడు భారము నీదే. అని తనయునిఁ గౌఁగిలించుకొని దీవించి పంపెను.

## 8

మఱునాఁటి ప్రభాతకాలమున రాధిక పూజాద్రవ్యములఁ గైకొని దేవీమందిరమున కరిగెను. ఆమె మోమునఁ గళకాంతులులేవు. కనుల నంధకారమావరించెను. దేవీమందిర ద్వారమున కామె యరుగునప్పటికామె పళ్ళెరమున నొక బాణమువచ్చి పడెను. ఆ బాణాగ్రమున నొకచీటిగలదు. రాధిక తనచేతిలోని పళ్లెరమును గుడిపై నుంచెను. చీటినివిప్పి చదివెను. మహానందముచే నామె ముఖకమలము వికసించెను. కాని క్షణములోనే ముకుళించెను. అయ్యో! యీచీటికై కదా నా పుత్రరత్నమును గోలుపోతినని విలపించెను. పూజ పూర్తికావించుకొనెను. నాథునొద్దకు వచ్చెను. చీటిని జూపెను. 'మనపని నెఱవేఱినదికదా!' యనెను. అదివిని వర్మ 'సరే మనమిఁక వెడలిపోదము. భగవంతుఁ డనుగ్రహించినచో మరల నసతికాలములోనే శత్రుగర్వభంజనము గావింపఁగలము. కాని రాధికా! నిజముచెప్పు ఈయాజ్ఞాపత్రమునకై యెవనినను ధారపోసితివి?'

రా:— పుత్రధనము.

వ:— ఏపుత్రుఁడు?

రా:— పెద్దబాబు.

ఆమాట వినఁగానే వీరవర్మ తుపాకిగుండున కెరనైన పక్షివలె గిలగిల కొట్టుకొని క్రిందఁబడి విలవిల తన్నుకొని స్మృతి తప్పెను. కొంతవడికిలేచి భార్యనుగాంచి,

'రాధికా? నీవు ఎంతపని చేసితివి? చేసేతల రాజపుత్రవంశమును నాశనము చేసితివి. నాయాశలు నిరాశలు గావించితివి' అనెను.

అది యర్ధరాత్రివేళ. రాధిక తాను అశ్వారూఢయై భర్తను పల్లకీలో నెక్కించి రహస్యమార్గమున కోటనుండి బయలుదేరి పోవుచుండెను.

ఇట్టి విచార ఘోరాంధకారరాత్రి యంతకు మున్నొక మారు వచ్చియుండెను. ఆనాడు రాధిక రాగమ్మను గర్వోరముగాఁ దూలనాడియుండెను. నాఁటి రాగమ్మాదేవి వాక్యములు నేఁటికి ఫలించినవి. కాని రాధిక యానాఁడా మెతోఁ జేసిన ప్రతిజ్ఞ ఫలించునా!

అది మండు వేసవి. గాడ్పులు నిప్పులు చెరుగుచున్నవి. పర్వతభాగములు భగభగమండుచున్నవి. రాధిక యశ్వారూఢయై యుత్తరదిక్కుగాఁ భర్తవెంటనే బోవుచుండెను. కోట దాఁటి రెండుయోజనముల దూరము చని యప్పటికాపద కడచియుండుననాయని యనుకొనుచుండెను. వీరవర్మ పల్లకీలోఁ జేతనారహితుఁడై యుండెను. బోయీలు చెమ్మటలు గ్రక్కుచుండిరి. పల్లకి వెనుక నలుగురాశ్వికులు వచ్చుచుండిరి. అందఱు దప్పిగొని యుసురుసురనిరి. పెదవు లెండిపోవుచుండఁగా నీళ్ళకై నీడకై తహతహలాడుచుండిరి.

రాధిక మొందులకో వెనుదిరిగి చూచెను. అంతలో శరవేగముతో వచ్చుచున్న యాశ్వికదళమొక్కటి యామెకు దృగ్గోచరమయ్యెను. ఆయూహింపనిసంఘటనము గాంచుట

తోడనే యామెకల దిద్దిరందిరిగిపోయెను. అది శత్రుసేనయా లేక తనపుత్రులు తమకై కొనివచ్చు సేనయా యని వితర్కించుకొనెను. నిరాశలోఁగూడ నాశ విడువదుగదా! చాలసేపామె భయముతోడను ఆశతోడను ఉయ్యాలలూఁగెను. ఇంతలో నది శత్రుసేనయని దృఢపడినది. దానిని గాంచఁగానె యామెకాళ్లు చేతులు చల్లఁబడినట్లయ్యెను. మేను కంపించెను.

బోయీలను పల్లకి నాఁపుమనెను. అదికని యామె సైనికులు యుద్ధసన్నద్ధులైరి. రాజుస్థితి కడు శోచనీయముగా నున్నది. నివురుగప్పిన నిప్పునకు గాలితగులఁగానే గప్పునమండు నట్లతనికీవార్త తెలియగానే వాని జర్జరితశరీరమునుండి శౌర్యాగ్ని ప్రజ్వరిల్లెను. విల్లందుకొనెను. కాని లాభమేమి? యెక్కిడలేక మ్రొగ్గతిలఁబడెను. అది కాఁగల యమంగళమునకుఁ జిహ్నమయ్యెను. తెక్కలు తెగినపక్షి పామునుగాంచి యెగురుచుఁ బడుచు నున్నట్లతఁడు లేచుచుఁ బడుచునుండెను.

రాధిక భర్తనొకచోఁ గూర్చుండఁబెట్టి మాట్లాడనెంచి 'ప్రాణనాథా' యని మఱి మాటలాడలేకపోయెను. ప్రతిజ్ఞకై ప్రాణములర్పించు రాధిక యిప్పుడు సామాన్యస్త్రీవలె శక్తిహీనయయ్యెను. అయ్యది భూషణమొకదా!

వీరవర్మ భార్యనుగాంచి 'రాధికా! నేనాఁడనుండి యేవిషయమునకై భయపడుచున్నానో యది నేఁడు తటస్థమయ్యెను. నాకనులయెదుటనే నా నిస్సహాయస్థితిని గమనించి శత్రువులు నీపైఁజేయివైతురేమోయని వగచుచున్నాను. అని కత్తికై

చేయిచాఁపెను కాని చేయిపట్టుతప్పెను. విడువఁగానే భార్యను గాంచి 'ప్రియురాలా నీవు ఎన్నోమాఱులు నాప్రతిజ్ఞను పాలించితివి'...అనెను.

ఆ వాక్యము వినఁగానే రాధికాముకుళితవదనముపై రక్తరేఖలు దీపించెను. కన్నీళ్ళుకట్టువడెను. అంతిమదశలోఁ గూడ తాను పతిప్రతిజ్ఞానిర్వహణమునకు పాసటయగుచుంటి నను నాశచే నామెయుత్సాహదీపితయయ్యెను. భర్తృభావమును గ్రహించెను. 'నాథా దైవమనుకూలించెనేని తమ ప్రతిజ్ఞ నెఱ వేర్పఁగలదానను' అనెను.

వీ:—నీవెన్నఁడును నాయాజ్ఞలఁ ద్రుణీకరింపలేదు.

రా:—నాముక్కున నూపిరున్నంతవఱకు నేను మీయాజ్ఞలను జవదాఁటను.

వీ:— ఇది నాతుది ప్రార్థన. దీనిని ద్రుణీకరింపకుము.

రా:—(కత్తితీసి తన వక్షస్థలమును నిడుకొని) నాథా! యిది తమ యాజ్ఞకాదు నేను సర్వకాల సర్వావస్థలయందును నాప్రాణములను మీచరణకమలములపైని విడువనెంచు చున్నాను.

వీ:— ప్రేయసీ! నీవు నాభావము గ్రహింపలేదు. నీప్రాణములు నాపాదములపై సర్పింపఁబడిన నేమిప్రయోజనము? నీవు చన్న పిదప నన్ను శత్రువులు తమ రాజధానికిఁ దోకొనిపోయి వీధివీధిని గాడిదనెక్కించి త్రిప్పుకుందురా?

ఈమాటలకర్థము సరిగా గ్రహింపలేక రాధిక జిజ్ఞాసా దృష్టితో భర్తవంకఁజూచెను. అదికని వీరవర్మ 'అర్థాంగీ నిన్నొక వరమడుగుచున్నాను.'

రా:—సంతోషముగా అడుగుఁడు.

వీ:— ఇదే నా తుదిప్రార్థన. మాటాడక చేయుదువా?

రా:—ముమ్మాటికి మీ పాదముల సాక్షిగా.

వీ:—చూడు-నీవు బాస చేసితివిసుమీ! దానినితిరస్కరింపరాదు.

రా:—(వణకుచు) మీరుచెప్పుడు-అదే యాలస్యము.

వీ:—నీకత్తితో నా తొమ్ముపైఁ బొడువుము.

ఆమాట రాధికాహృదయమున కశనిపాతముకాఁగా 'హృదయేశ్వరా!...'

వీ:—హృదయేశ్వరీ! నేను శత్రువులచే సంకెళ్ళు వేయించుకొనుటకు బ్రతుకుదలఁచుటలేదు.

రా!—అయ్యో! యిది నేనెట్లు చేయఁగలను?

వీరిట్లు సంభాషించుసంతలో యోధులలో తుదివాఁడు కూడ హతుఁడయ్యెను. శత్రువీరులు రాజుపైఁబడ నుంకించుచున్నారు. రాజు నిరాశాపూరిత నయనములతో భార్యవంకఁ జూచెను. రాధిక కింకర్తవ్యతామూఢయై క్షణకాల మూరకొన్నది. గుండె ఱాయి చేసికొన్నది. మెఱుపు మెఱసినచందానఁ గత్తిదూసి నాథుతొమ్ము పొడిచెను. ప్రేమనౌక ప్రేమసముద్రములో మునిఁగిపోయినది. రాజు హృదయము నుండి నెత్తురు కాలువలుగట్టెను. కాని వాని మొగమున శాంతి తాండవించుచున్నది.

ఇది యెంత కరుణామయదృశ్యము ! ఎవతె నాథునికై ప్రాణములర్పింపఁదలఁచెనో యామెయే నాథుని ప్రాణములఁ దీసెను. ఏహృదయముచే నాలింగితయై సుఖములఁజూఱఁ గొన్నదో, ఏ హృదయము తన మాన ప్రాణములనుగాపాడి నదో, యేహృదయము తన సర్వవాంఛలకుఁ గేంద్రమైనదో యాహృదయమునే యామె తనకరవాలముచే ఛేదించెను. ఇట్టి సాహసకార్య మేస్త్రీ చేతిఖడ్గమైనఁ జేసియున్న దా?

ఆహా! ఆత్మాభిమాన మెంత విషాదగాథగాఁ బరిణమించినది. మన తెలుఁగునాఁట నేసంస్థానమునను నిట్టి ఘటనలు ఘటిల్లలేదు.

అదికని శత్రుసైనికులు నిశ్చేష్టులైరి. సేనానాయకుఁడు రెండడుగులు ముందునకువచ్చి, "రాధికాదేవీ! దైవసాక్షికముగా మేమందఱము నీకు సేవకులము. నీయాజ్ఞను దలఁదాల్చి నెఱవేర్పఁగలము" అనెను.

రా:—మాపుత్రులలో నెవరైన జీవించియున్నచో మారెండు శవముల వాని కర్పింపుఁడు.

అని చెప్పి యాకత్తినే యెత్తి నెత్తురులు చిప్పిలఁ దన ఱొమ్మునఁ బొడిచికొనెను.

ఆమెకు స్పృహాతప్పునప్పటి కామెశిరము వీరవర్మ యురము నలంకరించెను.

---

# ౫ ఇంటిగుట్టు

రామారావు ఆంగ్లపాఠశాలలోఁ బ్రవేశించినది మొద లెప్పుడు నేక్లాసులోను బరీక్ష తప్పియెఱుఁగఁడు. అతఁడు ఎఫ్. ఏ., బి. ఏ., లు రెండును విశ్వకళాపరిషత్తున కంతటికి నుత్తమశ్రేణిలో నుత్తీర్ణుఁడయ్యెను. విశ్వదాతయగు విక్రమ దేవవర్మ మహారాజుచేఁ బారితోషికములుగూడఁ బడసెను. వానిగుణములను బట్టి వానికి వెంటనే ప్రభుత్వోద్యోగము గూడ లభించెను.

వాని తల్లి పూర్వాచారపరాయణ. అతఁ డింతవఱకు నభివృద్ధికివచ్చుటకు నామెయె కారణము. చిన్ననాఁటనే తండ్రి చనిపోవుటచే నామెయె యాతని నఱచేతిలోఁ బెట్టుకొని యల్లారుముద్దుగాఁ బెంచి పెద్దఁజేసెను. అతఁ డేయూరిలోఁ జదువుకొనిన నాయూరున కామెకూడ వెళ్ళి వానికిఁ బూఁట కూటింటి మెతుకులఁదిను గతి దప్పించెను. బి. ఏ., పరీక్షలో నుత్తీర్ణుఁడగునప్పటికే వానికిఁ జక్కనిచుక్కయగు పద్మావతి యను కన్యను బెండ్లికూడచేసెను. పద్మావతి యందమునకు నామెవిద్య మెఱుఁగువెట్టుచున్నది. రామారావు దొరతనము వారి కొలువులోఁ జేరిన కొలఁదినాళ్ళకె పద్మావతికూడఁ గాపు రమునకు వచ్చెను.

అత్తగారు వంటింటిలోఁ బొయిదగ్గఱఁబడి ముసుఁ గుచుఁ దేలుచునుండ నీమె చక్కఁగాఁ గూర్చుండి కథలు

కావ్యములు చదువుకొనుచుండెడిది. పనిపాటలలో నత్తగారికిఁ జేదోడు వాదోడు కాఁదలఁచినను నామె సనేమిరా యని యేపనియుఁ జేయనిచ్చెడిదికాదు. కారణము తన యాచార వ్యవహారములకును గోడలి యాచారవ్యవహారములకును సరిపడ దని యామెభయము. నవనాగరికత యనిన నామెకుఁ దల యేరు.

సాయంకాలము ఐదుగంటలైనది. రామారావుఅప్పుడే 'ఆఫీసు' నుండి యింటికివచ్చెను. కోటుతీసి కొక్కెమునఁ దగిలించి, కాళ్ళు చేతులు కడిగికొనివచ్చి పడకకుర్చీలో వాలి 'అమ్మా! మంచినీళ్లు తెచ్చిపెట్టు'మని పిలిచెను.

తల్లి వెంటనే మంచినీళ్లు తీసికొనివచ్చి యిచ్చి కొడుకుతోఁ గోడలిపైఁ జాడీలు చెప్పనారంభించెను. ఉదయము నుండి యిప్పటివఱకు ఆఫీసులోఁ బనిచేసి ప్రాణములు విసిగి వచ్చినవాఁడగుటచే నతఁడు చికాకుపడి తల్లి కిట్లనియె:

కొ:—అమ్మా! నన్నిప్పు డేమి చేయుమనెదవు? నేను ఆఁడువారికి శిక్షణ యిచ్చుటకుఁ జదువుకొనలేదమ్మా! ఆపని నీదికాని నాదికాదు. నీవు దానికి బుద్ధిచెప్పు. తిట్టు, కొట్టు. నీశిక్షణచే నది దారికి వచ్చినచో నాకుఁ గావలసిన దేమి యున్నది? 'దానికి మర్యాద తెలియదు. జ్ఞానహీనురాలు, మొద్దురాతిచిప్ప, అనాచారపరురాలు' అని మాటిమాటికి నాతోఁ నెందులకుఁ జెప్పెదవు? దండించి దారికిఁ దీసికొనిరా!

తల్లి:—ఏమిటిరా! నాయనా! నానోటివెంట మాటయే పైకి రానీయదు. ఇఁక నామొగము! శిక్షించుట యేమిటి? ఎవరైనఁ బెద్ద లింటికి వచ్చినప్పుడు వారి యెదుటఁ గూడ నేమైన ననునేమో యని నేను నోరెత్తక చచ్చి నట్లు పడి యుండుచున్నాను.

కొ:—నిన్ను గౌరవింపవద్దని నే నేమైనఁ జెప్పినానమ్మా!

త:—అయితే ఎవరు నేర్పుచున్నారురా?

కొ:—నీవు చాలా అజ్ఞానములోఁ బడుచున్నావమ్మా!

త:—నేనేమీ యజ్ఞానములోఁ బడుటలేదు. సత్యమే చెప్పు చున్నాను. నీదగ్గనుంచి యాబిడే నెత్తెక్కుచున్నది. అది నీదగ్గఱకువచ్చి యిచ్చకాలు చెప్పినప్పుడెప్పుడైన మందలించినావా. 'మాయమ్మను గౌరవించవలె'నని చెప్పినావా. నీవే దానికి దాసుఁడవై పోయినావు. ఇఁక 'నీయొక్కవేమిటి?నాభర్తసంపాదించి తెచ్చుచున్నాఁడు. నేను రాణివలెఁగూర్చుండెదను.' అని యది యను కొనుచున్నది. మగఁవాడు ఆఁడుదానిని కొంచెము కను లెఱ్ఱఁజేసినచో నెప్పుడును అదియింతసాహసముచేయదు.

కొ:—అయితే అమ్మా నేను ఏమీ సంపాదించుటలేదు. చేత కాని దద్దమ్మనని చెప్పనా? అలాగునఁ జెప్పినచో నేను వెఱ్ఱి వెంగళప్పయనుకొనదా ? ప్రతిమానవుఁడు తన భార్యతన్ను చాల తెలివిగలవాఁడు, సంపాదనపరుఁడు, తేజస్వి, యోగ్యుఁడు, అని తలఁచునట్లు మెలఁగఁ

జూచును. నేనెన్నఁడు దానిదగ్గఱఁ దెలివితక్కువగా వ్యవహరింపలేదు. మాట్లాడలేదు. దంభములు పలుకలేదు. కాని యెంత పనికిమాలినవాఁడైనను తన భార్య యొద్దఁ దన గౌరవము పోఁగొట్టుకొనఁజూడఁడు.

త:—నీవు అది చెప్పినదానికెల్లఁ జెవియొగ్గి మధుర మందహాసముచేయుచుండగాఁ నది నామాటవినునా? లక్ష్యము చేయునా! నీవే నీభార్యచే నన్నవమానపఱుపఁ జూచుచున్నావు. నేనేమి పాపముచేసినానురా? నన్నిట్లేడిపించితినుచున్నావు. నే నెంతయాశపెట్టుకొని, యెన్ని కష్టాలుపడి నిన్ను పెంచినానురా! నేనెన్నఁడు ఒంటినిండ గుడ్డ, కంటినిండ నిద్ర, కడుపునిండ కూడు ఎఱుఁగకుండ సర్వము నీకర్పించి పెంచినాను. మీనాన్న లేనిలోటు నాకు రానీయవని, నీవే మహామేరువవని తలంచినాను. నా నగలు నాణెములు అన్నియు నీ చదువుకే యర్పించినాను. ఇంక నాయొద్ద నేమి నిధియున్నది? యిట్లు ఇల్లాలిచే నిడుమలు పెట్టించుచున్నావు.

కో:—అమ్మా! నీనేమి కోరుచున్నావో నాకేమీ తెలియుటలేదమ్మా! నీయుపకారము నేను మఱువఁగలనా! నీవు నాకు చదువుచెప్పించుటకాదు జీవనము లొసంగినావు. గడుపారఁగన్నావు. నగలు నాణెములేకాక రక్తము కూడ ధారపోసినావు. ఎన్నిజన్మలెత్తినను నీ ఋణము తీర్చలేను. నేను బ్రతికియున్నంతకాలము నీయిచ్ఛా

పూర్తిచేయుటయే నావిధి. శక్తివంచన లేకుండగ నీ సేవ చేయగలను. నేను సంపాదించి తెచ్చిన ధనమంతయు నీచేతిలోఁ బెట్టెదను. ఇఁక నీవు కోరునదేమియుండును? నేఁ జేయునదేమియుండును? భగవంతుఁడు నిన్ను నన్ను యావత్ప్రపంచమును సృజించినాఁడు. అతనికి మనమేమి బదులు తీర్చుచున్నాము? తీర్పగలము? వానిపేరైనఁ దలంచుటలేదు కీర్తినైన గానముచేయుటలేదు. అంత మాత్రమున నాతని యుపకారభారము తగ్గిపోవు చున్నదా? చక్రవర్తియైనను తల్లి ఋణమునుదీర్చుకొన లేదు. నేననఁగా నెంత! నీకు మనశ్శాంతిమాత్రమే చేకూర్పఁగలను. నీ కెన్నఁడు నసంతుష్టి కలిగించినట్లు నాకు జ్ఞప్తిలేదు.

త:—నీవా? నాకు చిత్తశాంతికలిగించువాఁడవు. నీయింట నేను దాసివలె మెలఁగుచున్నాను. నీబూబమ్మ నామాటైనఁ దలపెట్టదు. నేనును, ఒకప్పుడు కోడలనే. మామగారిని నెత్తిబెట్టుకొని పూజించెడిదానను. రాత్రు లందుఁ గాళ్లుపిసికి, ఒడలిపట్టి, తలకుఁ జమురురాచి, పాలిచ్చి పండుకోఁబెట్టి పిమ్మటఁ బరుండెడిదానను. నీ యిల్లాలోఁ బగలెల్లఁ బడకకుర్చీలోఁబరుండి గ్రంథాలు చదువుకొనుచున్నది. ప్రొద్దుగ్రుంకుసరికి మంచమెక్కు చున్నది. నేను జచ్చితినో బ్రతికితినో దాని కక్కఱ లేదు. ఇందులకా నాయనా నేను నిన్నుఁగని పెంచినది.

గో:—నీవు నన్నుఁ బెంచినమాట వాస్తవము. ఈ సేవయుం తయు నాచేఁ జేయించుకొనుము. నాతో నీమాట యెప్పుడైనఁ జెప్పినావా? అమ్మా నాకుఁ జాలమంది స్నేహితులున్నారు. ఎప్పుడును వారలతల్లులకు ఈగలు త్రోలుట చూడలేదమ్మా! నాకర్తవ్యభారమును నా భార్యపైఁ బెట్టెదవేల? అది తనంతతాను సేవచేసినచో నాకంటె సంతోషించువా రెవ్వరుందురు? దానికా తెలివియున్నచో నందలములోఁ బెట్టిత్రిప్పనా? అది నీసేవచేయలేదని చిట్టు బుట్టుమనఁగూడదు. నేనేకోడల నైనచో అట్లే చేయుదును. అత్తగారు నన్నుఁ దన కూఁతురువలెఁ బ్రేమించినచో నేనును నామెపాదములు పట్టెదను. కాని యామె నామగనికిఁ దల్లియనిమాత్రము పట్టును. కాని కోడలత్తగారిపాదములొత్తుటయన్న నాకుఁ గిట్టదు. పూర్వము భార్యలు పతులకుఁ గాళ్లుపిసికెడివారు. ఇప్పుడుగూడ నక్కడక్కడ నా యాచారము గలదు. నా భార్య నాపాదము లొత్తినచో నాకుఁ జాల కష్టము గాఁదోచును. మాటలు సేవ చేయించుకొనఁగోరి నేనెన్నఁడు నామెను సేవించుటలేదు. కాళ్లుపట్టుట భార్య భర్తకు దాసియను పురాతనభావమునకుఁ జిహ్నము. ఇప్పుడు భార్యాభర్త లిద్దఱు సమానులని నాభావము.

శే:—అదే నేను చెప్పునది. నీవే యిట్టిమాటలన్నియుఁ జెప్పి దానిని నెత్తెక్కించినావు. నీవే నామీఁద వైరము

సాధించుచున్నావు. ఇంత సిగ్గుబిడియములేనిది, ఇంత భయభక్తులులేనిది, ఇంతగయ్యాళిగంప, ఇంత మొండిది, ఇంతబరిదిగినదానిని ప్రపంచములో నెక్కడను లేదురా నాయనా! ఇరుగు పొరుగు పేరంటాండ్రు మనయింటికిఁ జూడవచ్చినప్పుడు వారితో ఈ రాణిగారు ఆకాశము నుండి యూడిపడినట్లు మాట్లాడనైన మాట్లాడదు. ఆదర సత్కారములాచరింపదు. గదిలోనుండి యూడిరాదు. కర్మముచాలక వారు తనగదిలోకే వెళ్ళినచో నిదేమి పాపమోగాని మంచమైన దిగదు. నమస్కారమైనఁ జేయదు.

కో:—అమ్మా! వారు నిన్నుఁజూచుటకు వచ్చియుండవచ్చును. వారు నీవు ఏసంగతులు మాట్లాడుకొనుచుందురో! నడుమ నదివచ్చి నిలిచినచో బాగుగానుండునా? నేను నాస్నేహితులు మాట్లాడుకొనుచుండఁగా నీవువచ్చి మధ్యనిలుచున్నచో నాకెట్లుండును? నీ కోడలు చెలికత్తెలు మాట్లాడుకొనుచుండఁగా నామె పిలిచినఁగాని నేనెన్నఁడు నాదరికైన వెడలను. ఇది ఇప్పటి యాచారము.

త:—అది నీ కేమి మందుపెట్టినదో యేమి పసరురాచినదో కాని దానిమీఁద యీఁగ వ్రాలనీయవు. మామధ్యకు వచ్చి దానిని నిలువఁ మనుచున్నానా? వచ్చినవారిని ఆదరింపుమన్నాను.

కో:—ఎట్లు ?

త:—తుంగచాపో, కంబళియో పఱువవలెను. 'దయచేయుఁడు. కూర్చుండుఁడు' అని పిలువవలెను. ఏదైన ఫలహారము పెట్టవలెను. ఆగది యీగది ఆవస్తువు ఈవస్తువు దొడ్డి తోఁట దూడ దుడికి చూపవలెను. వెళ్లునప్పుడు బొట్టు పెట్టి పంపవలెను. అట్లుచేసినచో పదిమంది 'ఫలాని వారి కోడలమ్మా' యని చెప్పుకొందురు. అట్లు చేయనిచోఁ బదిమంది యేమనుకొందురు? 'ఎంత గర్వమమ్మా వారికోడలకు—ఒలుకేబంగారము. పెదవికదిపి మాట్లాడనే మాట్లాడదు. ముఖమెత్తి చూడనైనఁ జూడదు. పలుకరించిన రత్నాలు రాలిపోవునాయేమి? ఇందమమ్మా యనిన ఇందమమ్మా యందుము. ఇంతేగా భాగ్యము!' అని యనుకొనరురా నాయనా!

కో:—(ఆలోచించి) ఔను. ఇది దానిలోటే నేను దానికి నచ్చజెప్పెదనులే.

త:— (ప్రసన్నవదనముతో) నిజము చెప్పుచున్నానురా యబ్బాయీ! అది మంచముదిగనైన దిగదు. వచ్చినయాఁడువారు రాడిపోయుచున్నారు. నేను సిగ్గుచే జీకిపోవుచున్నాను. దానికిఁ జీమకుట్టినట్లులేదు.

కో:—అమ్మా! అదిచేసిన ప్రతిపనికి నేనా బాధ్యుఁడను? ఇదేమి కర్మమమ్మా! అదేదిమైనఁ దప్పుజేసినప్పుడెదుటివారిదగఱ దానిని వెనుకవేసికొని రావలెనుగాని

నిందింపవచ్చునా? నేనుఆఫీసులో రోజూతొంబదితొమ్మిది
తోట్లులు చేయుచుందును. అధికారులు నాపైఁ గోప
పడుచుందురు. నేను లక్ష్యపెట్టక కొంచెము వీలుకలిగి
నప్పుడెల్ల నేక్లబ్బునకో వెళ్ళి పేకాడియో, పత్రికలు
చదివియో కాలముపుచ్చుచుందును. నేను దోషినం
దువా? కాదందువా? నేను దోషినని యెఱిఁగి యుం
డియు నీవు నాపక్షమును వహించి వారిని దూషింతువు.
నీకే యధికారమున్నచో నన్ను వారు తిట్టినందులకు
ద్వీపాంతరవాస శిక్షకూడ విధింతువు కానా? కాదా!

త:—(వికసితవదనయై)మాయబ్బాయి నెవరైనదూషించినచో
నేను వారిని ఆకులు పూవులుపెట్టి పూజింతునా?

కో:—ప్రతికుమరుఁ డిట్లె తల్లి యనుగ్రహమునకుఁ బాత్రుఁడు
కావుట కాసించుచుండును. ప్రతి మాతయుఁ దన
పుత్రుని దోషములనిట్లే కప్పిపుచ్చుచుండును. - కాని
కోడండ్రపట్ల యింతకాఠిన్యమేల వహింతురో తెలియ
కున్నదమ్మా! నీకోడలు తప్పుచేసినచోఁ బదిమందిలో
దానిని నిందింపక "చిన్నపిల్లయేమియు నెఱుఁగదు. లోప
ములున్న మన్నింపుఁడని" వచ్చినవారితోఁ జెప్పి వారి
దృష్టిలో దానిని బెద్దదాసినిగాఁ జేయుము. అంతేకాని
వారి తిరస్కారములకు నీవు దోహదమొందులకిచ్చు
చున్నావు? దానినవమానపఱచుట నీకు సరదాయా?
నేనుకూడ బ్రాహ్మణులనుగాని పెద్దలనుగాని యాద

రించుటలేను. నామనసునకు నచ్చనివారిని నేను గౌర వింపనే గౌరవింపను. కేవలము నరసిన వెంట్రుకలు, బోసినోరు, ముడతలు వాలిన మేను ఎవరి యాదరమునకు బాత్రములుగావు. విభూతిరేఖలుగాని, రుద్రాక్షమాలి కలుగాని, పంగనామములుగాని, తులసిమాలలుగాని అవధాని, శాస్త్రి, ఆచార్యాదిపదములు భక్తిభాజన ములు గావు. ప్రాచీనమైనదెల్ల సాధువని నేను నమ్మను. అట్లుచేయుట నైతికముగా నపరాధమని తలంతును. మనోవాక్కాయకర్మములచే నెవ్వఁడు సమానార్హుఁడో వానినే నేను గౌరవింతును. మోసగాఁడు, స్వార్థపరుఁడు, పరరంధ్రాన్వేషి, లంచగొండి, పరభాగ్యోపజీవి యైన వాఁడు బ్రహ్మాండ నాయకుఁడైనను వానికి నేను చేయెత్తి మ్రొక్కను. ఇది నాదురహంకారమని నీవనవచ్చును. కాని, నేను మాత్రము నాయభిప్రాయమును మార్చు కొనఁజాలను. నామనస్సునకు నచ్చని పని యేదియు నేను జేయను. నావలెనే నీకోడలుకూడ ననకొను నేమో! మన యింటికి వచ్చెడి వారి నొకరిద్దరిని నే నెఱుఁ గుదునులే. వారు అయినింటివారే కాని విశాలహృద యులు గారు. పైఁగా సంకుచితభావము గలవారు. అందులో నొకతె నిందాస్వరూపిణి, ఒకతె స్తోత్రమూర్తి. ఒకతె తిట్లమారిది. వీరందఱు పూర్వాచారములకు దాసురాండ్రు. ఈర్ష్యాసూయలు వారికి వెన్నతోఁబెట్టఁ

బడినవి. వారందఱు తమ గృహములను నరకతుల్యముగాఁ జేసినవారె. ఇట్టివారిని నీ కోడలు గౌరవింపనంతమాత్రమున నది దుష్టురాలని నేనను కొననమ్మా!

త:— చాలు ఊరకొనురా! అబ్బాయి! యెవరైన విన్నచో నవ్విపోదురు? చూడు ఎప్పటికైన నీయూబిడి నీచేతికి చీపురిచ్చి తుడిపింపకపోయినను, పాత్రయిచ్చి వండింపకపోయినను నన్నీ పేరుపెట్టి పిలువకు. బ్రతికియుండినఁ జూడకపోవుదునా? చూచుచున్నావుగా! తొంబదియేండ్ల ముసలిదానను కూర్చుండిన చోటుననుండి లేవలేనిదానను నేను వండుట ఆపడుచుకోడలు కుర్చీలోఁ గూర్చుండి నవలలు చదువుట.

కో:—అమ్మా! నీవు వంట చేయుట, అది నవలలు చదువుట, మంచిదికాదు. నేనెన్నఁడును దియ్యఁగీకరింపను. కానియది పుట్టింట నెప్పుడు వంటచేసి యెఱుఁగదని కూడ మనము తెలిసికొనవలె నమ్మా! వారియింట వంటబ్రాహ్మణుఁడున్నాఁడు, ప్రొయ్యి చూచినంతనే తలనొప్పిచే బాధపడు దానిని వంటచేయుమని నిర్బంధించుట యెంత మూర్ఖత్వమమ్మా! కొన్నాళ్ళకు దానియంతట యదే మన యింటిపనులకు నలవాటు పడునని నిదానించుచున్నాను. దానిని ధనికునకిచ్చి పెండ్లిచేయకపోవుట దాని తల్లిదండ్రులతప్పు. అప్పుడు మనము మసిపూసి మారేడుగాయచేసి మనకు లేని గొప్పతనమును బ్రక

టించుకొన్నాము మోసముచేసినాము. ఇప్పుడు ఏ మొగము పెట్టుకొని దానిని వంటచేయుమని, గిన్నెలు తోముమని, వాకిలి యూడ్చుమని చెప్పఁగలము. మనము చేసిన మోసపు ఫలితమిప్పు డనుభవించి తీర వలసినదే. 'సిరి సంపదలు లేకపోయినను అత్తయు భర్తయు నన్నన్నివిధముల నాదరించుచున్నారు. పనిపాటలు చెప్పుటలేదు. ఇక్కడ చెంబక్కడ పెట్ట మనరు—సాదింపరు' అని యామె యనుకొనునట్లుగా మనము వ్యవహరించి యామెను సంతోషపెట్టవలెను. ఇదే మనము చేసినమోసమునకు విఱుగుడు. నీవే యాలోచించి చెప్పు. ఈపాటి సంతోషమైన మనమా మెకుఁ గలిగింపనిచో నామె మనస్సెట్లుండునో!

త:—మన సంబంధము దొఱకినఁ జాలని వారలేవచ్చి పిల్లనిచ్చి నారు కాని మనమేమైన వారిని బ్రతిమాలినామా?

కో:—వారలొక్క పెండ్లికొడుకునకే యాశించినారు చదువు కొనినవాఁడు గదాయని కాని మనము కన్యాధనముల రెండింటిని ఆశించినాము.

త:— వీరి తాతలవంటి వారనేకులు మన సంబంధము కొఱ కట్టులు చాచుకొనివచ్చినారు.

కో:—మన బాహ్యాడంబరమును జూచి వారందఱువచ్చినారు కాని మన బండారము బైటబడినచో నొక్కరైన మనవంకఁ గన్నెత్తి చూచియుందురా?

త:— మీయత్తవారేమంత గొప్పవారునాయనా? పదిమంది రోగులు వచ్చుచున్నారు. వారిరోజులు బాగుగా నున్నవి. పదిరాళ్ళుపడుచున్నవి. మీమామగారితండ్రి నాయుడుగారిదగ్గఱ పదిరూపాయలు జీతానికుండుట నేనేఱుఁగుదును. ఆయింటి యాఁడుపడుచేగా నీభార్య. ఈభోగానికే వంటచూచినఁ దలనొప్పి రావలెనా? సంపన్నుల పిల్లలత్తింటికి వచ్చి యాయింటికిఁ దగిన ట్టుగా సకలవిధాల చాకిరీలు చేయుదురు. నీయాబిడ వలె పుట్టింటి భాగ్యమును వెళ్ళఁబోసికొనరు. అదేమి పుణ్యమోగాని 'యీ సంసారము నాది. ఈయిల్లువాకిలి నావి' యన్న జ్ఞానమేలేదురాదానికి!

కొ:—నీవు దానికేమైన దెలియఁజెప్పినఁగదా! తెలియునది గుసగుసలు దుమదుమలు రవరవలు నాట్యమాడు నింటి నెవ్వరైనఁ దన దనుకొందు రమ్మా! ప్రేమ స్నేహము తాండవమాడునది యిల్లుకాని తక్కినది వల్లకాడు. ఏకన్యయు సారెకావళ్ళతోఁ బల్లకీ దిగఁగానే యత్త గారినిఁ దల్లియనుకొనదు. అత్త తన తల్లికంటెఁ దన్నె క్కువగా నాదరించినప్పుడె యది యత్తను దల్లిగా భావించును.

త:— ఇఁకఁజాలులే నాయనా! యూరకొమ్ము. నన్ను బాధిం పకు. 'పెండ్లాము బెల్లము తల్లి విషము' నగునట్లుగాఁ గాలము మాఱిపోయినది. నిన్న నేడిదేమున్నదిరా?

మీర లేమి మంత్రము నేర్చుకొనివత్తురో యత్తింటికి ప్రొద్దెక్కి లేచుట కోడలికి లక్షణమైపోయినది. ఇట్టి నిద్రాదేవత ముఖముచూడరాదురా! చూచినఁ బాపముకూడ వచ్చునురా!

కో:— అమ్మా! నేనును ఎండెక్కియే లేచుచున్నాను. నీవు నన్నెప్పుడును మందలింపలేదేమి?

త:— ప్రతిబింబరూపములోను నీతో సమానముగాఁ జూచుకొనుచున్నావురా దానిని?

కో:— అది యీయిల్లు తనదిగా భావించుటలేదు. మనకు బంధువురాలు. బంధువులను గౌరవించుటయేగాని దోషములు వెదకుదుమా!

త:— భగవంతుఁడెవరికి నిట్టికోడలిని మాత్రము ప్రసాదింపరాదురా తండ్రీ!

కో:— అయితే నీకేఁ బ్రసాదించినాఁడు!

త:— ప్రపంచములోఁ గోడండ్రకు లోటున్నదిరా!

కో:— కోడండ్రకు లోటులేదుగాని, సాధ్వులకు లోటున్నది.

త:— ఏలా పుట్టినదిరా బాబూ? పండుకొన్నతరువాతఁ బ్రక్కలోని బిడ్డ గుక్కపట్టి యేడ్చిన కదలదు మెదలదు. ఇదేమినిద్దురరా బాబూ! లోకములో నెక్కడఁ జూడలేదు. పండువంటి పిల్లవానిని దీసికొని పుట్టింటికి వెళ్లి మూఁడు నెలలుండి వచ్చునరికి సగమైపోయినాఁడురా నాతండ్రి.

కో:—అయితే మనుమనిపై నీ కున్నంతప్రేమ దానిబిడ్డపై దానికి లేదనెదవా? దానికి మోహములేనిచోఁ దప్పే దాని బాధ్యత నీవు నెత్తినిబెట్టుకొనెద వేల? దానికి దాని బిడ్డపై సంపూర్ణ స్వాతంత్ర్యము గలదు. దాని యిష్టము వచ్చినట్లది తన బిడ్డను బెంచుకొనును. నిన్నే మైన సలహా యడిగినఁ జెప్పు లేదా తప్పుకొని యూరకొనుము. ఎందుకు అవసరము లేని గొడవ లన్నియు నెత్తినిబెట్టుకొందువు. అందఱు తల్లులు తమ బిడ్డలను ప్రేమించుచునేయున్నారు. అదియేమీ తప్పు గాదు.

త:— అయితే అన్నియుఁ జూచుచు నోరు మూసికొని యూర కొననా? కొంపంటుకొను చుండఁగాఁ జూచుచుఁ జూచుచు నెవరికి నూరకొన బుద్ధియగునురా?

కో:—అమ్మా! నీవు కాటికిఁ గాళ్ళు చాపుకొని యున్నావు. అది యీ యింటిలో పదికాలములపా టుండునది. ఈ యింటి లాభనష్టములఁ గూర్చి దాని కున్నంత చింత నీకుండనక్కఱలేదు. నే నేమిచేయఁ గలను? దానిని బెదరింతు ననుకొనుము. అది లక్ష్యపెట్టక పెంకె జవాబు లిచ్చినచో దానిని వంచుటకు నాదగ్గఱ నేమిసాధనమున్నది?

త:— రెండురోజులు దానితో మాట్లాడకుండ ఉండు. దాని రోగము కుదురును.

కో:—నాకు నమ్మకము లేదమ్మా! నేను దానితో మాట్లా
డనిచో పుట్టింటికి దారిపట్టును.

త:—భగవంతుఁడారోజు కల్పించినచోఁ గొత్తకోడలినిఁ దీసి
కొని రానురా?

కో:—తీసికొని వచ్చెదవు. కాని యది దీని కప్పగారైనచో?

వారిరువురు నిట్లు సంభాషించుకొను చుండఁగాఁ గోడలు వచ్చి చెంత నిలిచెను. ఆమెనుజూచి వారిరువురు తెల్లఁబోయిరి. రూపవతి, సరళహృదయ, అభిమానవతి యగు పద్మావతి వారిని శాసించుట కవతరించినదియా యనునట్లున్నది. కపోల యుగళిగందు వాడెను. అధరములు విషపూరిత మందహాస మును జిలికెను. కన్నులు వ్యంగ్యపరిహాస సంభరితములై యుండెను. ఆమెను గాంచి యత్తగారు 'సిగ్గువిడిచి యెందులకు వచ్చితి విక్కడకు' అని ప్రశ్నించెను.

కో:—ఏమీ! యీ తమాషాలో నేనుగూడ నానంద మనుభ
వింపరాదా!

కో:—తల్లి కొడుకు మాట్లాడుకొనుచుండఁగా నీవు నడుమఁ
ప్రవేశించుటకు హక్కులేదు.

ఆమాట వినఁగానే యామె మండిపడి

కో:—బాగుగానున్నది. ఇఁకఁ దమరు సంభాషణ కట్టిపెట్టుఁడు.
ఏ భర్త తనభార్యా నిందలకుఁ జెవియొగ్గునో వాఁడు
భర్తకాఁడు. వానికిఁ బతిధర్మములో ఓనమాలైన
రావు. నాయెదుట మిమ్ము మాతల్లి నిందించినను

ఊరుకొనను. మీరు మాయింటికి వచ్చినప్పు డందఱు
మిమ్ములను స్తుతించువారే. పిన్నలు పెద్దలు కూడ
మీకు ఊడిగము చేయుచుందురు. మీరు కోరినచో
వైకుంఠమును దెచ్చి యఱచేతిలోఁ బెట్టఁ జూతురు.
అక్కడ మావారు మీకుఁ జేయు సన్మానమునకు
బదులుగా మీ రిక్కడ మొగము చిట్లింపులు, మూతి
విఱుపులు, చివాట్లు, తిరస్కారములు, [illegible]
ములు ప్రసాదించుచున్నారు. ఎంత రసికులు; మీరు
మాయింటికి వచ్చినప్పుడు మా వారెవ్వరైన మిమ్ముఁ
'ప్రొద్దెక్కి లేచినారేమి? పెద్దలకు నమస్కరింపరేమి?'
యని ప్రశ్నించినారా? మా నాన్నగారెప్పుడైన
మిమ్ముల నీఁగల దోలుమన్నారా? బట్టలుతుకు
మన్నారా? కుర్చీలు సర్దమన్నారా? మందు కలుప
మన్నారా? వంటచేయమన్నారా? కాఫీ కాయు
మన్నారా? ఇక్కడ నాకిట్టి మర్యాద యిచ్చుచున్నా
రేమిటి? నేనిచ్చటికి దాసిగా రాలేదు. అర్థాంగిగా
వచ్చితిని. అర్థాంగిననఁగా చీపురుకట్టగాదు. మీ
యిష్టము వచ్చినట్లు విసరివైచుటకు! నాకుఁ దోచి
నట్లుగా మీకు సాయపడుటయే నాపని. ఆ సాయ
మైనను నాకు బుద్ధిపుట్టినదే చేయుదును గాని మీ
తిట్లకు మొట్లకు జడిసికాదు. నా కేదైన నేర్పవలసి
యున్నచోఁ దల్లివలె నేర్పుమనుఁడు. నే నేర్చుకొనెదను.

ప్రేమతో విషము పోసినను త్రాగుదును గాని విరోధముతో అమృతము పోసినను త్రాగను. మీరు నన్ను మాటలు గ్రుచ్చినట్లుగాఁ బోటు మాటలను క్షణము ఆడకుండ నుండియున్నచో నీవారికి నేను సకలము నాది యనుకొని చక్కఁబెట్టుకొనెడి దాననే. కాని మీరు ప్రతి క్షణము నన్ను దాసినిగాఁ జూచుచున్నారు. ఎన్నాళ్ళని భరింతును. మీరు నాప్రాణాలు తీయకుండ విడువరు!

ల:—వినుచున్నావా? అబ్బాయీ! విన్నా రాణిగారి మాటలు? ఆమె దాసిగా రాలేదఁట. రాణిగా వచ్చినదఁట. మనమిద్దఱము ఆమెకు సేవచేయవలెను. ఆమె మనపై నధికారము చలాయింపవలెను. ఆమె కెవ్వరును ఏమనియుఁ జెప్పఁగూడదు. నేను దానిమాటలు వినలేక చచ్చుచుండఁగా నీవు నవ్వుచు వినుచున్నావు. 'పోనీ! అమ్మ! నీవు దానిని కూఁకలిడకు. నచ్చఁ జెప్పు'మని యైనను అనవు. గడగడ వణఁకిపోవుచున్నావు.

కొ:—ఔనమ్మా! కొంచెము శాంతించి యాలోచించు. దానిమాటలు నేనాలకింపకున్న నెవరాలకింతురు. దానికి నేనీమాత్రము సానుభూతియైనఁ జూపరాదా? మా నాన్నగారు నీ మాటలు వినెడివారా? లేదా? నిన్నుఁ బ్రేమించెడివారా? లేదా? భర్త భార్య మాటలు వినుట క్రొత్త యాచారమా? నీవింత చెడ్డగాఁ దలఁచుట కేమున్నది.

త:—అయ్యో! నాయనా! యెన్ని నేర్చినావురా? నీపెండ్లాము నెదుట నీవు నన్నవమానింప వలయునురా! నిన్నిందు లకే కని పెంచినానురా?

అని దుఃఖము నాఁపుకోనలేక యేడ్చుచు వంటింటి లోనికిఁ బోయెను. భార్యాభర్తలిద్దఱు కౌతూహలా యత్త చిత్తులై యామె వంకఁ జూచిరి. యానంతోషమే క్షణములో నామెయెడ సానుభూతిగా మాఱెను.

కో:—తల్లి హృదయము............

శో:—తల్లి హృదయము కాదు స్త్రీ హృదయము.........

కో:—ఎందుచేత?

శో:—ఏ హృదయము పురుషుని సహాయస్నేహ సంపత్తుల కోరునో యా హృదయము, అన్యస్త్రీ వాని నాశించి నపు డీర్ష్యాసూయల కాలవాలమగును.

కో:—ఏమిటి పిచ్చిదానివలె మాట్లాడుచున్నావు?

శో:—నిజము చెప్పుచున్నాను.

కో:—నీవు పొరపడినావు. నీవుకూడ అత్తవైనపుడుగాని ఈ తత్త్వము బోధపడదు.

శో:—నేనత్తను గావలెనని కోరుటలేదు. ఈ కుఱ్ఱవాఁడు బ్రతికి బట్టగట్టి పదిమందిలోఁ దలత్రిప్పుకోనుచుఁ బెండ్లి చేసికోని తాను భార్య బ్రతికినఁ జాలు. కోడలి జోలి నాకేల?

కో:—అయితే నీకొడుకు యోగ్యుఁడు కావలెనని, కోడలు లక్ష్మివలె నుండవలెనని, వారి జీవితము సుఖముగాఁ గడపవలెనని నీకుఁ గోరికలేదా ?

కో:—ఏమీ! నేను తల్లినిగానా!

కో:—తల్లికి అత్తకు భేదమున్నదా ?

కో:—ఆకాశమునకు భూమికి నున్నంత భేదమున్నది. తల్లి ప్రేమించును. అత్త శాసించును. స్త్రీ యెంత సహన శీల, కరుణాస్వరూపిణి, సద్గుణవతియైనను అత్తకాఁగానె యీనిన పులియగును. కొడుకు నెంత ప్రేమించుచుం డునో యంత నిర్దయతోఁ గోడలిని శాసించుచుండును. ఈవిషయములో నున్న నేనే నమ్ముటలేదు. అధికార మద మెవ్వరికుండదు. నేనత్తను గాకూడదని వేయి దేవ తలకు మ్రొక్కుచున్నాను. అత్తల వలననే స్త్రీలు బానిసలగుచున్నారు. అత్తలుండనిచో స్త్రీల బానిస తన మేనాఁడో యంతరించి యుండెడిది.

కో:—నీవు సహజసౌజన్యముతోఁ జరించినచో మాతల్లిపై గూడ బెత్తనము చెలాయింపఁగలవు. మాసంభాషణ మేమైన నీవు విన్నావా?

కో:—నేనేమీ విననక్కరలేదు. వినకుండఁగనే యన్నియుఁ దెలియును. ఆకోడలి యేడుపు...

కో:—కాదు కాదు. నీవు పూర్తిగా పొరపడినావు. మా యమ్మలో అపూర్వమగు హృదయపరివర్తనము గంటిని. ఆమె తాను నీయెడఁ జూపిన కాఠిన్యమునకు లోలోనఁ గుమిలిపోవుచున్నది. నిన్నటి మొన్నటివఱకు నీ వెండెక్కి లేచినచో మండిపడెడిది. ఇప్పుడు పెందలకడ నీవు లేచినచో ఎక్కడ చలి తాఁకునోయని వగచుచున్నది. లేవఁగానే నీకు వేడినీళ్ళు పెట్టుమని చెప్పుచున్నది నౌకరులతో.

కే:—(సంతోషముతో) నిజమేనా?

కో:—ఔను. నేను విని యాశ్చర్యపడిపోయినాను.

కే:—అయితే నేను తెల్లవారకమునుపే లేచెదను. ఏమంత చలి వేయును-కాని మీరు నన్ను మోసపుచ్చుటలేదుకదా?

కో:—దురహంకారమునకుఁ జికిత్సయేమున్నది? తాఁ జేసిన యన్యాయములఁగూర్చి ప్రతివ్యక్తియు, నప్పుడప్పుడు పశ్చాత్తాపము నొందుచుండును.

కే:—అబ్బా! యేమి తేనెలొలుకుచున్నవి మీమాటలనుండి. నేను కోడికూయకమున్నే లేచెదను. పాపము పెద్దవారు ఆవిడ నాకై నీళ్ళు కాఁచుట యేమిటి? నేనే కాఁచికొందును. మానవులకు సాధ్యముకానిదేమున్నది?

కో:—మాయమ్మమాటలు వినుచుండిన నాకద్భుతముగా నున్నది. ఆమెమాటలలో నేదియో దైవికశక్తి యావహిల్లినట్లున్నది. ఈవరకు నీయవివేకమునకు, చపలతకు ఆమె మండిపడుచుండెడిది. ఇంటికివచ్చిన పెద్దవారికి

మ్రొక్కలేదని, మంచము దిగలేదని, ఆదరింపలేదని సణుగుకొనుచు చెప్పుచునుండెడిది. నీ వయసువంటి వయసులో నందఱు నీవలెనె యుందురని యిప్పుడామె గ్రహించినది. బహుశః మా అమ్మగారికి తనయౌవన కాలము జ్ఞప్తికి వచ్చినట్లున్నది. కావుననే యిప్పుడు నిన్నుఁగూర్చి 'చక్కఁగా సింగారించుకొని సీతాకోక చిలుకవలె నుండేరోజులివి. ఇంటికి ఎప్పుడు నెవ్వరో పెద్దలు వచ్చుచునేయుందురు. వారందఱకు మ్రొక్కుచుండవలసినదేనా? వారేమి యాకాశమునుండి యూడి పడినారా ?' అనుచున్నది.

కో:—ఈమాటలు వినఁగానే నా చెవులలో అమృతము పోసి నట్లున్నది.

కో:—నాకు నమ్మకము కలుగుటలేదు. ఇది కలయా వైష్ణవ మాయయా యనిపించుచున్నది.

కో:—ఇప్పుడు దారికి వచ్చినారు అత్తగారు.

కో:—నిజముగా నిది దైవప్రేరణ.

కో:—నేనింక కోడరికములో సెబాసనిపించుకొందును. సింగా రింపులతోఁ గాలము వెళ్ళపుచ్చను. సినీమాలకు ఏ వారమునకో పదిరోజులకో కాని వెడలను. పెద్దలకు మ్రొక్కుదును. వారిదీవనలపొందుదును తప్పేమున్నది?

కో:—మాయమ్మ సినీమా మాట తలపెట్టలేదే!

కో:— మీకు సినీమాపిచ్చి యున్నదని నాకుఁ దెలియదా?

కో:—నీవెంతగొప్పగాఁబెరిగితివి, ఏయింటిలోఁ బుట్టితివి? ఇప్పుడీ పెద్దలకు మ్రొక్కుదుననుట నాకుఁ దలనొప్పిగా నున్నది.

కో:—గొప్పింటఁబెరుఁగుటకు ఫలితము ఇతరులను నీచముగాఁ జూచుటయా? ముసలివారు మూర్ఖులైన నగుదురుగాని ప్రపంచానుభవము గలవారుగా నుందురుగదా? నమ్రత్వముచేతను సద్వృత్తిచేతను కులగౌరవము నిలుచును గాని, కసరులు విసరులు, చిరాకు పరాకులు ఈసడింపులు - వీనిచే నిలువదు.

కో:—ఆకస్మికముగా మాతల్లిగారికిట్టి పరివర్తనము కలుగుట కాశ్చర్యమగుచున్నది. ఇప్పుడామెఁ కోడలత్తయడుగులకు మడుగులొత్తుట, బట్టలుతుకుట, తగనిపనియని తలంచుటయేగాక, కోడలత్తకు దాసికాదని చాటుచున్నది.

కో:—నాతోడే!

కో:—ఔను నిజము. ఇఁక నిన్ను వంటకూడఁ జేయనీయదు. 'అబ్బాయీ దానికి పొగచూచిన తలనొప్పి వచ్చుచున్నది. వంటవానినిఁ బెట్టరా' యని నన్ను వేధించుచున్నది.

కో:—(ప్రసన్నవదనయై) నేను ఆకాశముపై ఎగిరిపోవుచున్నట్లున్నాను. ఇటువంటి యత్తగారిపాదములుకడిగి నెత్తిని పోసికొని త్రాగినఁ దప్పేమియున్నది? పోనీ మీయొక

మాటాడుగక పోయినారా? ఏమమ్మా! 'యిన్నాళ్ళు రాసి అంపానఁ బెట్టినా'వని.

శాం:—ఎందుకడుగలేదు. అడుగకుండ నుందునా? అప్పుడు 'ఎల్లప్పుడు నేను వండుటయేనా? అది వండరాదా' యనెడిది. ఇప్పుడు 'అబ్బాయీ? నేను సామాన్య కుటుంబములోఁ బుట్టినదానను. అది మైనింటిబిడ్డ. దానిని గష్టపెట్టుట యెందుకురా' యనుచున్నది. అత్తగారు నిష్కళంకహృదయురాలు. ఆబిడనుజూచిన జాలివేయుచున్నది. వారు పెరిగిన వాతావరణము వేఱు. ఒక్కసారిగా దానిని విడిచిపెట్టుట కష్టతరమైన కార్యము. ఆమెయేకాదు ఎవరును విడువలేరు. అయినను ఆమె చాల ఉదారహృదయ. మీరుమాత్ర మప్పుడె తొందరపడి వంటవానిని బెట్టకుఁడు. మీకు ప్రమోషను రాఁగానే పెట్టవచ్చును. అందాక నేనే వంటచేయుదును. ముగ్గురకో నలుగురకో వంటచేయుట కెంతసేపు పట్టును? నేను కోడలినై నందుల కామెను సుఖపెట్టవలదా? నాకు సర్వము తెలియును. నాపై నౌకరు పెత్తనము చెలాయించుట నాకు గిట్టదు.

శా:—కాని రాత్రులయందు మాయమ్మ కాళ్ళు పట్టుచుఁ కూర్చుండినచో నాకుఁ జాల కష్టమనిపించును.

శాం:—ఎందుకు మీరంత బాధపడవలదు. ఆమె నన్ను కన్న బిడ్డవలెఁ జూచుచున్నప్పుడు నేనామెను గన్నతల్లివలెఁ

జూడవలదా? నేను కాళ్ళు పట్టినఁ జాలు. ఆమె నాకై
పంచప్రాణా లర్పించుటకు సిద్ధపడును. పెద్దలకు సేవ
చేయుటచే మానహాని రాదు. ప్రతిష్ఠ తగ్గదు. కానీ
ఖర్చు కాదు. కీర్తి వచ్చును.

కో:—నీచేతను ఖర్చు ఎక్కువగుననియైన ననుటలేదు. నా
జీతము నీచేతనే పెట్టుమనుచున్నది.

కో:—నవ్వుచునే యన్నారా? యీమాట.

కో:—ఆఁ నవ్వుచునే కాదు. ప్రేమతోఁ గూడను. పెత్తనము
తనచేతిలో నున్నచో నీవు చీటికి మాటికి మెంతులకు
జీలకఱ్ఱకుఁ గూడ శ్రమపడవలసి వచ్చుననియు, అడుగు
టకు సిగ్గుపడుదువనియుఁ దలంచుచున్నది.

కో:—కాదండీ! నేనీజంజాటము అప్పుడే నా నెత్తిని బెట్టు
కొనను. మీజీతము గొఱ్ఱెతోఁక. నాచేయి దూఁబఱ
చేయి. ఉన్న నాల్గుపైసలు నాల్గునాళ్ళకే ఖర్చయి
పోయినచో జీతమువచ్చుదాఁక గడచుటెట్లు? పొదుపరి
తనమున కామె యాఱితేఱినచేయి. ఆమెమీఁది కోప
ముచే నడిగెడిదాననుగాని నాకేమి కావలెను. చూడుము
నాపెట్టెలో నెన్ని రూపాయలున్నవో! కాకిచేఁ గబు
రంపినఁ జాలు మానాన్నగారు పాతికో పరకో పంపు
చునేయున్నారు. కాని నేనింకఁ గొంచెము చేయి వెను
కకు లాగవలెను. ఇంకను నాన్నగారి నెన్నాళ్ళు పీడిం

పను? బ్రతికియున్నన్నినాళ్లు ఆయనపై పన్నువిధించుట భావ్యమా ?

కో:—చూడు! మాయమ్మ నిన్ను ఎంత ప్రేమించుచున్నదో!

కో:—మీరు చూతురుగా నేనామెకెంత సేవ చేయుదునో!

కో:—అయితే ఉపక్రమణిక యెవరిది ?

కో:—ఆలోచన యామెది. వ్యవహారము నాది. వంటవేళ యైనది. ఇక మీరు కబురులు పెట్టకుడు వెళ్ళుచున్నాను. నేడేమి శాకపాకములు చేయుమనెదరు ?

కో:—నీచేతితోఁజేసిన నేమి రుచింపదు? ప్రతీది అమృతము వలె నుండును.

కో:—మీమాటలలోనే యున్నదికా యమృతము ! బలే నాటక మాడినారుగా !



Printed by Royal Printing Works, Tanuku June - 1948.